


పేయాళ్వార్లు అనుగ్రహించిన

# మూన్రామ్‌తిరువన్దాది

టీకా తాత్పర్యాలతో



ప్రచురణ

ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

తిరుపతి - 2013

# మూన్ఱామ్‌తిరువన్దాది

## టీకా తాత్పర్యాలతో

ప్రచురణ : ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్, తి.తి.దే., తిరుపతి

వెల : అమూల్యము.

మొదటి ముద్రణ : 2013

ప్రతులు : 2000

ప్రకాశకులు :

**శ్రీ ఎల్.వి. సుబ్రహ్మణ్యం,** ఐ.ఏ.ఎస్.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి - 517 507

ముద్రణ :

తి.తి.దే. ముద్రణాలయం

తిరుపతి-517 507



# నివేదన

అనాదిగా భారతదేశం ఆధ్యాత్మిక సంపదకు పుట్టినిల్లు. ఎందరో మహర్షులు, ఆచార్యులు, దివ్యసూరులు, భక్తశిఖామణులు ఈదేశంలో అవతరించి తాము చిరకాలం తపస్సు చేసి, శ్రమించి సంపాదించిన అమూల్యమైన ఆధ్యాత్మిక జ్ఞానసంపదను తరతరాలుగా మనం అనుభవించేటట్లు మనకు అందించి, ఇహపరాలలో సుఖ సంతోషాలను, ఆనందాన్ని మనం అనుభవించే సన్మార్గాన్ని చూపించారు. దక్షిణభారతదేశంలో, విశేషించి ద్రావిడదేశంలో, దివ్యసూరులనబడే భక్తవరేణ్యులు ఉద్భవించి, ద్రావిడ భాషలో నాలాయిరదివ్యప్రబంధం అనబడే మధురభక్తి వాఙ్మయాన్ని నిర్మించి, ఆ భాషాసాహిత్యాన్ని, భారతదేశాన్ని సుసంపన్నం చేశారు. వీరి ప్రబంధాలన్నీ విష్ణుపరత్వాన్ని సుస్పష్టంగా ప్రతిపాదిస్తాయి.

ఆళ్వార్లలో కాలాన్నిబట్టి సరోయోగి (పొయ్‌గైఆళ్వార్), భూతయోగి (పూదత్తాళ్వార్), మహాయోగి (పేయాళ్వార్) అనే ముగ్గురు మొదటివారు. వీరికే ముదలాళ్వార్లు అనిపేరు. వీరు ముగ్గురు సమకాలీనులు. ఒకే సమయంలో మూడు అంతాది దివ్యప్రబంధాలను ఆశువుగా పలికారు. అంతాదిప్రబంధం అంటే – ముక్తపదగ్రస్తంవంటిది. ముందున్న పాశురం చివర వుండే భాగం, తరువాతి పాశురానికి ఆరంభంగా కూర్చబడి, ఈ క్రమం చివరివరకూ కొనసాగితే ఆ ప్రబంధం అంతాది అనబడుతుంది. ఇదే ద్రావిడంలో అన్దాదిగా వ్యవహరింపబడుతున్నది. చివరి పాశురంలోని చివరి భాగంతో మొదటిపాశురం ఆరంభమైతే ఆ అన్దాది మణ్డల అన్దాది అనబడుతుంది. ముదలాళ్వార్ల ప్రబంధాలన్నీ ఇటువంటివే.

చాలాకాలం ఒకరికొకరు తెలియకుండా గ్రామైకరాత్రంగా సంచరిస్తూ, భగవానుని దివ్యకళ్యాణగుణాలను, లీలలను అనుసంధిస్తూ ఉండే వీరు ముగ్గురూ భగవత్సంకల్పానుసారం ఒకనాడు గోపాలపురంలో (తిరుక్కోవలూర్) రాత్రివేళ బాగా వర్షం కురుస్తున్న సమయంలో, మృకండుముని ఇంటి వసారాలో కలిసారు. అపుడు శ్రీమన్నారాయణుడు వారి మధ్యలోకి వచ్చి చేరి, వారికి సమ్మర్దాన్ని కలిగించాడు. తమ మధ్యలో వేఱొకరు ఎవ్వరో వచ్చి చేరారు – అనే సంగతిని గుర్తించిన ముదలాళ్వార్లు తమ జ్ఞాననేత్రంతో భగవానుని దర్శించి, ఆ అనుభవం లోపల ఇముడక పెల్లుబకగా దివ్యప్రబంధాల రూపంలో లోకానికి పంచిపెట్టారు. పొయ్‌గై ఆళ్వార్లు ముదల్ తిరువన్దాదిని, పూదత్తాళ్వార్లు ఇరణ్డామ్ తిరువన్దాదిని, పేయాళ్వార్లు మూన్ఱామ్

తిరువన్దాదిని ఆశువుగా పలికారు. ఈ మూడు ప్రబంధాలు నూఱు పాశురాలను కల శతకాలు. ఇవి శబ్దమాధుర్యాన్ని, అర్థగాంభీర్యాన్ని కల్గిన ఉత్తమోత్తమ కవిత్వానికి తార్కాణాలు. ఎన్నో వేదాంతతత్త్వాలకు నిలయాలు. ప్రత్యేకించి ఈ మూడు ప్రబంధాలలో శ్రీవేంకటాచలవైభవం, శ్రీనివాసుని మహిమ విస్తృతంగా వర్ణింపబడింది.

ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్, టి.టి.డి, ఆళ్వార్ల ప్రబంధాలను, ఆళ్వార్ల తర్వాత భక్తి సంప్రదాయాన్ని భారతావనిలో ప్రచారం చేసిన పలువురు శ్రీవైష్ణవాచార్యులు లోకానికందించిన సాహిత్యాన్ని విస్తృతమైన ప్రచారాన్ని చేయాలనే ఉద్దేశ్యంతో సులభమైన వ్యావహారికభాషలో చిన్న చిన్న గ్రంథాలను ప్రచురించి, అందరికీ ఆ వాఙ్మయాన్ని అందించాలని ప్రయత్నిస్తున్నది. ఇప్పుడు చేయబడే టీకా తాత్పర్యాలతో కూడిన మూన్ఱామ్ తిరువన్దాది గ్రంథప్రచురణం ఈ ప్రయత్నంలో ఒక భాగమే. మూన్ఱామ్ తిరువన్దాదికి సులభమైన భాషలో టీకా తాత్పర్యాలను సిద్ధం చేసిన ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు, ఈ గ్రంథాన్ని ప్రచురించ డానికి తగిన ప్రయత్నాన్ని చేసిన దివ్యప్రబంధ ప్రాజెక్ట్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ చొక్కలింగం అభినందనీయులు. భక్తులు, ఆస్తికులు, సాహిత్యరసికులు టీకా తాత్పర్యాలతో కూడిన ఈ మూన్ఱామ్ తిరువన్దాదిని చదివి ఆనందిస్తారని నమ్ము తున్నాను.

**శ్రీ ఎల్.వి. సుబ్రహ్మణ్యం,** ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి-517 507



## పేయాళ్వార్ అనుగ్రహించిన

# మూన్ఱామ్ తిరువన్దాది

### కురుకైకావలప్పన్ అనుగ్రహించిన తనియన్

**శీరారుమ్ మాడ త్తిరుక్కోవలూరతనుళ్**
**కారార్ కరుముకిలై క్కాణ ప్పుక్కు- ఓరా**
**త్తిరుక్కణ్డే నెన్ఱురైత్త శీరాన్‌కழలే**
**ఉఱై క్కణ్డాయ్ నెఞ్జే ! యుకన్దు**

నెఞ్జే = ఓ మనసా !, శీర్ ఆరుమ్ మాడమ్ =అందం పొందికగా నిండి ఉండే మిద్దెలను కల, తిరుక్కోవలూర్ అదనుళ్ = తిరుక్కోవలూర్ లోని గృహం మధ్యభాగంలో (వసారాలో), కార్ ఆర్ కరు ముకిలై = వర్షాకాలంలోని నల్లని మేఘంవంటి స్వామిని, కాణ పుక్కు = సేవించాలని, (ప్రారంభించి) ప్రయత్నించి, ఓరా = మనస్సు అనే ఆంతరనేత్రంతో అనుసంధించి, తిరు క్కణ్డేన్ ఎన్ఱు ఉరైత్త = "తిరు క్కణ్డేన్" అని ప్రారంభించి, నూఱు పాశురాలను అనుగ్రహించిన, శీరాన్ = గొప్పతనం నిండుగా కల పేయాళ్వార్ల, కழలే = శ్రీపాదాలనే, ఉకన్దు ఉఱై = ఆనందించి పల్కు.

ఈ తనియన్‌ద్వారా, పరమపురుషుని దర్శించినవారు, ఆదర్శనాన్ని సంసారులకు వారు అనుభవించేటట్లుగా తమ శ్రీసూక్తులను అనుగ్రహించినవారు, భగవద్దర్శన మనే సంపదను కలవారైన పేయాళ్వార్ల శ్రీచరణాలే సదా అనుసంధేయాలు- అని చెప్పబడింది.

అవ :- లోకాలను అన్నిటిని శరీరంగా కల్గిన భగవానుని సాక్షాత్కారంలో వాటిని అన్నిటినీ దర్శించినవారే అయినా, భక్త్యుత్కర్షవల్ల అతని అంతరంగసంపదలను (ఐశ్వర్యాలను) కొన్నిటిని "దీనిని చూచాను, దానిని చూచాను'' అని అంటూ తాము అనుభవించిన రీతినిగూర్చి ఈ మొదటి పాశురంలో పేయాళ్వార్లు పల్కుతున్నారు.

1. **తిరు క్కణ్డేన్ పొన్‌మేని కణ్డేన్ తికழుమ్**
**అరుక్క వణినిఱముమ్ కణ్డేన్- శెరుక్కిళరుమ్**
**పొన్నాழி కణ్డేన్ పురిశఙ్గమ్ కైక్కణ్డేన్**
**ఎన్నాழிవణ్ణన్ పాలిన్ఱు**

ఇన్ఱు = ఇపుడు, ఎన్ ఆఴి కణ్ణన్ పాల్ = సముద్రవర్ణుడైన నా స్వామివద్ద పార్శ్వంలో, తిరు = లక్ష్మీదేవిని, కణ్డేన్ = దర్శించగలిగాను, పొన్ మేని = అందమైన తిరుమేనిని కూడా, కణ్డేన్ = సేవించగలిగాను, తిక ఴుమ్ = ప్రకాశించే, అరుక్కన్ = సూర్యునివంటి, అణి = అందమైన, నిఱముమ్ = కాంతినికూడా, కణ్డేన్ = దర్శించగలిగాను,శెరు = యుద్ధభూమిలో, కిళరుమ్ = కోపించి విజృంభించే, పొన్ ఆఴి = అందమైన శ్రీసుదర్శనాన్ని, కై = కుడిచేతిలో, కణ్డేన్ = దర్శించగలిగాను, పురి శజ్గమ్ = దక్షిణావర్తశంఖమైన పాంచజన్యాన్ని ఇంకొక బాహువులో, కణ్డేన్ = దర్శించగలిగాను.

లక్ష్మీదేవికి, సకలరత్నాలకు నివాసస్థానం అయిన సముద్రంవలె ఉండే వానిలో వాటిని అన్నిటినీ దర్శించాను- అని అంటూ తమ పరమభక్తితో ప్రారంభంలోనే భగవానుని పేయాఴ్వార్లు అనుభవించారు.

అవ :- “ఈ అనుభవానికి ఆటంకాలు పలు ఉన్నాయే !” అనే భయం, సందేహం వెంటనే కలుగగా, అవి కన్పించిన క్షణంలోనే భగవదనుభవానికి అడ్డంగా ఉండే అవి అన్నీ సూర్యుని చూచిన మంచువలె, నిప్పుకణాలలో పడిన దూదిమూటవలె నశించిపోతాయి. అని ఇందులో అంటున్నారు.

2. ఇన్ఱే కఴల్ కణ్డేన్ ఏఴ్ పిఱప్పుమ్ యా నఱుత్తేన్
పొన్‌తోయ్ వరైమార్విల్ పూన్దుఴాయ్- అన్ఱు
తిరు క్కణ్డుకొణ్డ తిరుమాలే ! ఉన్నై
మరుక్కణ్డుకొణ్డెన్ మనమ్

పొన్ తోయ్ = బంగారుమయం అయిన ఆభరణాలు చేరిన (అలంకరింపబడ్డ), వరై = పర్వతంవంటి, మార్బిల్ = వక్షఃస్థలంలో, పూమ్ తుఴాయ్= అందమైన తులసిని కలవాడై, అన్ఱు = సముద్రాన్ని చిలికిన అపుడు ఆ కాలంలో, తిరు = లక్ష్మీదేవి, కణ్డు కొణ్డ = అనుభవించేటట్లుగా పొందిన, తిరుమాలే = లక్ష్మీవల్లభా!, ఎన్ మనమ్ = దాసుడైన నామనస్సు, ఉన్నై మరు క్కణ్డు కొణ్డు = పొందికగా కూడి ఉన్నది. (అందువల్ల), యాన్ = నేను, ఇన్ఱే = ఈనాడు, కఴల్ = నీ శ్రీపాదాలనే, కణ్డేన్ = దర్శించి ఆనందాన్ని, అనుభవించగలిగాను, ఏఴ్ పిఱప్పుమ్ = (నా అన్ని) జన్మలను, అఱుత్తేన్= (ఇకపై అనువర్తించకుండా ఉండేటట్లు) నశింపజేసికొన్నాను, (ఛేదించాను)

ఇక రాబోయే జన్మలను అన్నిటినీ సమూలంగా లేకుండా చేసికొన్నాను అన్నది నిశ్చయం.- అనిభావం.



అవ :- గడచిన పాశురంలో తమ మనస్సు అతనిపట్ల స్థిరంగా నిలచి ఉన్న రీతిని గూర్చి ఆఴ్వార్లు తెలిపారు. దీనినే ఆధారంగా చేసికొని భగవానుడు తమ మనస్సు తప్ప మిగిలిన దానిని దేనినీ తెలియనివాడైనాడు- అని ఈపాశురంలో అంటున్నారు.

3. మనత్తుళ్ళాన్ మాకడల్ నీరుళ్ళాన్ మలరాళ్
తనత్తుళ్ళాన్ తణ్డుఴాయ్ మార్బన్- శినత్తు
చ్చెరునర్ ఉక చ్చెఱ్ఱుకన్ద తేజ్గోతవణ్ణన్
వరు నరకమ్ తీర్క్కు మ్మరున్దు

మా కడల్ నీర్ ఉళ్ళాన్ = గొప్ప క్షీరాబ్ధిలోని జలంలో నిద్రించేవాడు, మలరాళ్ తనత్తు ఉళ్ళాన్ = లక్ష్మీదేవి స్తనతటాలలో నిలచి ఉన్నవాడు, తణ్ తుఴాయ్ మార్బన్ = చల్లని తులసిని వక్షఃస్థలంలో అలంకరించుకొన్నవాడు, శెరునర్ = శత్రువులు, ఉక =నశించేటట్లుగా, శినత్తు = కోపంతో, శెఱ్ఱు =వధించి, ఉకన్ద = ఆనందించినవాడు, తేజ్గ ఓదమ్ వణ్ణన్ = నిండైన సముద్రంవంటి రూపాన్ని కలవాడు, వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు = తీర్చుకోవడానికి వీలు లేని, అనివార్యమైన సంసారం అనే నరకాన్ని పోగొట్టగల మందువంటివాడు అయిన సర్వేశ్వరుడు, మనత్తు ఉళ్ళాన్ = నా మనస్సులోకి వచ్చి (ఇక విడిచి పోలేని రీతిలో) స్థిరంగా ఉన్నాడు.

క్షీరాబ్ధి మొదలైనవానిని మఱచిపోయి, నా మనస్సులోనే స్వామి అణగి ఉన్నాడు, దానిని పొందిన తరువాత- అని భావం. ఇటువంటి భావాన్నే నమ్మాఴ్వార్లు “తిరుమాలిరుఞ్జోలై మలైయే” (10-7-8), “తలైమేల్ పునైన్దేన్” (10-4-4) “కల్లుమ్ కనైకడలుమ్” (పెరియతిరువ-68) ఇత్యాది పాశురాలలోను, “నాకత్తణై క్కుడన్దై” (నాన్ముకన్ తిరు -36) అనే పాశురంలో తిరుమఴిశైప్పిరాన్, “వెఱ్పెన్ఱిరుఞ్జోలై” (ఇరణ్డామ్ తిరు-54) అనే పాశురంలో పూదత్తాఴ్వార్లు, “పనిక్కడల్ పళ్ళికోళై” (5-4-9) అనే పాశురంలో పెరియఴ్వార్లు వ్యక్తంచేశారు. అప్పిళ్ళై తమ టీకలో “మనత్తుళ్ళాన్” అనే పదం తరువాత “వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు” అనే ప్రయోగాన్ని అన్వయించి అర్థం చెప్పారు. “మా కడల్ నీర్” మొదలైనచోట్ల పూర్వం స్వామి ఉండడం- తమ మనస్సులో చోటు చేసికోవడంకోసం అని, తమ మనస్సులో ఉండడం -తమ “వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు” (అనివార్యాలైన నరకాలను తీర్చే ఔషధం) కావడంకోసం

అని భావం.

అవ :- సర్వరక్షకుడైన అతని శ్రీపాదాలే ఉపాయంగాను, ఉపేయంగాను అయినవి- అని ఇందులో అంటున్నారు.

**4. మరున్దుమ్ పొరుళుమ్ అముతముమ్ తానే**
**తిరున్దియ శెజ్గణ్మాలాజ్గే- పొరున్దియ**
**నిన్ఱులక ముణ్డుమి*ழ்*న్దు నీరే*ற்*ఱు మూవడియాల్**
**అన్ఱులకమ్ తాయో నడి**

తిరున్దియ = (ఇతడే పరమపురుషుడని స్పష్టంగా దర్శించి గ్రహించదగిన) చిహ్నాన్ని కల్గిన, శెమ్ కణ్ = ఎఱ్ఱతామరలవంటి తిరునేత్రాలను కల, మాల్ = ఆశ్రితవ్యాముగ్ధుడు, ఆజ్గే = లోకాన్ని రక్షించడం అనే ఆ కార్యంలోనే, నిన్ఱు పొరున్దియ= స్థిరంగా నిలచి, పొందికగా ఉన్నవాడు, ఉలకమ్ = లోకాలను, ఉణ్డు = (ప్రళయం లయం చేయకుండా ఉండేటట్లుగా) ఆరగించి, ఉమి*ழ்*న్దు = తరువాత వానిని వ్యక్తం చేసి, అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, నీర్ ఏ*ற்*ఱు = మహాబలి దగ్గర దానజలధారాపూర్వకంగా ఆ లోకాలను అన్నిటినీ దానంగా పొంది, తడవి కొలిచినవాడైన భగవానుని, అడి తానే = శ్రీపాదాలే, మరున్దుమ్ = ఔషధంవలె సంసారవ్యాధిని తీర్చేవిగా, పొరుళుమ్ = ధనంవలె కోరినవానిని పొందించేవిగా, అముదముమ్ = అమృతంవలె భోగ్యంగా ఉన్నాయి.

స్వామి శ్రీచరణాలు వ్యాధిని తీర్చే మందువలె సంసారమనే వ్యాధిని తీర్చేదై, అభిమతార్థాన్ని లభింపజేసే అర్థం- ధనం- వలెమనకు ఇష్టమైన మోక్షాన్ని పొందించేదై, సహజంగానే అత్యంతమధురంగా ఉండే అమృతంవలె చాలా మధురంగా ఉన్నది. ఉపాయం అనిష్టాన్ని తీర్చేదిగాను, ఇష్టాన్ని అనుగ్రహించేదిగాను -రెండు విధాలుగా ఉంటుంది. ఈ రెండు ఆకారాలు స్వామి శ్రీచరణాలకు ఉన్నాయనే విషయం- **"మరున్దుమ్ పొరుళుమ్"** అనే పదాలతోను. **"అముదమ్"** అనే పదంద్వారా ఉపేయమై ఉన్నదనే విషయం చెప్పబడ్డాయనికూడా చెప్పవచ్చు. లేక, ఔషధమే అనిష్టం అయిన వ్యాధిని తీర్చేది గాను, ఇష్టం అయిన దేహబలాన్ని ఇచ్చేదిగాను ఉంటుంది కనుక **"మరున్దు"** అనే పదమే రెండు అకారాలను కల ఉపాయంగా ఉండడాన్నిగూర్చి తెలుపుతున్నదనవచ్చు. అపుడు **"పొరుళుమ్, అముదమ్"** అనే ప్రయోగం రెండు విధాలైన ఆకారాలను కల ఉపేయాన్ని తెలుపుతుందని చెప్పాలి. అంటే, మిగిలినవానిని



పొందడంలో సాధనంగా ఉంటూ, ఉపేయంగా ఉండే ధనం వలె, తానే సహజంగా- భోగ్యంగా ఉంటుంది కనుక ఉపేయంగా ఉండే అమృతంవలె- ఈవిధంగా రెండు విధాలైన ఉపేయంగా ఉన్నది భగవానుని శ్రీచరణాలే- అని భావం. త్రివిక్రముని వృత్తాంతంలోనే భగవానుడు మందు, ధనం, అమృతంగా అయిన రీతిని అప్పిళ్ళైతమ టీకలో వివరించారు. నముచి మొదలైన విరోధులను నిరసించడంవల్ల ముందుగా, తానే యాచకుడై మహాబలిదగ్గరకు వచ్చి యాచించి అతని ఔదార్యగుణాన్ని వ్యక్తం చేసినందువల్ల ధనంగా, తన శ్రీచరణాలను అతని శిరస్సుపై పెట్టడంవల్ల అమృతంగా స్వామి శ్రీపాదాలు అయ్యాయి. ఈ పాశురంలో భగవానుని శ్రీచరణాలే ప్రాప్య, ప్రాపకాలనే సారం తెలుపబడింది.

అవ :- లోకాలను కొలిచిన వృత్తాంతాన్ని గడచిన పాశురంలో కీర్తించడం ప్రారంభించగానే, ఆ*ழ்*వార్లు అందులో అత్యంతాభినివేశాన్ని పొంది ఆ త్రివిక్రమమూర్తి అందాన్ని ఈ పాశురంలో అనుభవిస్తున్నారు.

**5. అడి వణ్ణమ్ తామరై అన్ఱులకమ్ తాయోన్**
**పడివణ్ణ మ్బార్కడల్ నీర్‌వణ్ణమ్- ముడి వణ్ణమ్**
**ఓరా*ழி* వెయ్యోన్ ఒళియు మ౦ఃతన్రే**
**ఆరా*ழி* కొణ్డార్క్కు *ழ*కు**

అన్ఱు = (మహాబలి జలధారా పూర్వకంగా దానం ఇచ్చిన) అపుడు, ఉలకమ్ తాయోన్ = లోకాలను తడవి, కొలిచిన స్వామియొక్క, అడి వణ్ణమ్ = శ్రీపాదాల కాంతి, తామరై =తామరపూవువలె ఎఱ్ఱగా ఉన్నది, పడి వణ్ణమ్ = తిరుమేని కాంతి, పార్ కడల్ నీర్ వణ్ణమ్ = భూమిని చుట్టి ఉండే సముద్రంలోని నీటివర్ణంవలె నల్లనిదై, చల్లనిదై ఉన్నది, ముడి వణ్ణమ్ = కిరీట కాంతి, ఓర్ ఆ*ழி* వెయ్యోన్ = ఏకచక్రాన్ని కల రథాన్ని అధిరోహించేవాడు, వేడి కిరణాలను కల వాడైన సూర్యుని వర్ణంవంటిది, ఒళియుమ్ = ఆ స్వామియొక్క తేజస్సుకూడా, అదు అన్రే = ఆ సూర్యుని తేజస్సువంటిదే కదా!, ఆర్ ఆ*ழி* కొణ్డార్క్కు అ*ழ*కు = అందం పొందికగా ఉండే శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించి ఉండే భగవానుని అందం ఇటువంటిది. (ఇంతటి వైలక్షణ్యాన్ని కల్గినది).

"ఆర్" అనే పదానికి పూర్ణంగా ఉండే- అనే అర్థాన్ని చెప్పి, స్వామి శ్రీహస్తంలో సుదర్శనాన్ని ధరిస్తే ఇంకొక ఆభరణం ఏదీ అవసరం లేనట్లుగా నిండుగా ఉంటుంది. అనే అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- అనంతుని అందంలో తలమునకలు వేసేవారుకదా ఆళ్వార్లు. అందువల్ల గత పాశురంలో ఆ స్వామి అందాన్ని గూర్చిన ప్రస్తావం రాగానే, "అతని వర్ణం, లీలలు, శ్రీపాదాలు - అనేవి అన్నీ అందం మూర్తీభవించినట్లుగాకదా ఉన్నాయి''- అని ఈ పాశురంలో ఆనందంతో తలమునకలు వేస్తున్నారు.

6. **అళ్గకన్ఱే యాళియాఱ్కు ఆళినీర్ వణ్ణమ్**
**అళ్గకన్ఱే అణ్డమ్ కడత్తల్- అళ్గకన్ఱే**
**అఙ్గై నీరేత్తార్‌క్కు అలర్‌మేలోన్ కాల్ కళువ**
**కఙ్గై నీర్ కాన్ఱ కళల్**

ఆళియాఱ్కు = శ్రీసుదర్శనాన్ని కల సర్వేశ్వరునకు, ఆళి నీర్ వణ్ణమ్ = సముద్రజలంయొక్క వర్ణంవంటి వర్ణం, అళ్గకు అన్ఱే = అందమే మూర్తీభవించినది కదా!, అణ్డమ్ కడత్తల్ =లోకాలను కొలిచిన లీల, అళ్గకు అన్ఱే = అందమే మూర్తీభవించినది కదా !, అఙ్గై = అందమైన శ్రీకరంలో, నీర్ ఏఱ్ఱార్‌క్కు = మహాబలియొక్క దానజలాన్ని గ్రహించిన భగవానునకు, అలర్ మేలోన్ = తిరునాభీకమలంలో ఉండే బ్రహ్మ, కాల్ కళువ = శ్రీచరణాలను కడుగగా (అభిషేకించగా), (అపుడు), కఙ్గై నీర్ = గంగాజలాన్ని, కాన్ఱ = వ్యక్తం చేసిన, కళల్= ఆ శ్రీపాదం, అళ్గకు అన్ఱే = అందమే మూర్తీభవించింది కదా !

ఆ నీటిని గంగాజలంగా ప్రవహింపజేసిన శ్రీపాదాలు- అని భావం. శివుడు మొదలైనవారిని పరిశుద్ధం చేసిన గంగకు జన్మస్థానంగా ఉన్నందువల్ల పావనత్వాన్ని మాత్రమే కల్గి ఉన్నదా !**"మేల్ నిన్ఱ విశుమ్బిల్ వెణ్ తుకిల్ కొడియెన విరిన్దు వలన్తరు మణినీర్ క్కఙ్గై"** (పెరియతిరు-1-4-3) అనే రీతిలో ఆకాశంలో తెల్లని వర్ణాన్ని కల వస్త్రంతో చేయబడ్డ కేతనంవలె విస్తరించిఉండే గంగయొక్క తెలుపు, శ్రీపాదాల ఎఱుపు- ఈ రెండు వర్ణాల కలయికను చూస్తే అందమే రూపు దిద్దుకొన్నట్లుంటుంది కదా ! అతని (భగవానుని) వర్ణం సముద్రవర్ణంవలె ఉండడాన్ని, అతడు లోకాలను కొలవడం అనే అరుదైన లీలను చేశాడని, పరమపావనం అయిన గంగను అతని శ్రీపాదాలు ఉత్పత్తి చేశాయి అని లోకులు అంటారే తప్ప, ఆ రంగు, ఆ లీల, ఆ పాదాలు- అందమే మూర్తీభవించినట్లుండడాన్ని భావించి హార్దంగా పలికేవారే లేరే ! **"మధురాధిపతే రఖిలం మధురమ్"** అనే రీతిలో అతనిది అంతా. అందమే మూర్తీభవించినట్లుగా ఉండడాన్ని తలచి మనస్సులో ద్రవించి పలుకవద్దా- అని భావం.



అవ :- ఈ రీతిలో భగవానుని అందంలో అభినివేశాన్ని పొంది, తమను స్వామికి వశం చేసికొన్న ఆళ్వార్లు, ఈ పాశురంలో తమ మనస్సును ఉద్దేశించి, "అతని శ్రీచరణాలలో నేను దాస్యాన్ని చేసి ఉజ్జీవించేటట్లుగా ఓ మనసా ! నీవు సహకరించి రా'' అని అంటున్నారు.

7. **కళల్ తొళుతుమ్ వా నెఞ్జే ! కార్‌క్కడల్ నీర్‌వేలై**
**పొళిలళన్ద పుళ్ళూర్‌తి చ్చెల్వన్- ఎళిలళన్ద అ**
**ఙ్గణ్ణఱ్కరియానై యెప్పొరుట్కుమ్ శేయానై**
**నణ్ణఱ్కరియానై నామ్**

నెఞ్జే = ఓమనసా !, మా కడల్ నీర్ =నల్లని సముద్రంలోని నీటిలో కూడిన, వేలై = తీరాన్ని కల్గిన, పొళిల్ = భూమిని, అళన్ద = కొలిచినవాడు, పుళ్ ఊర్‌ది = గరుడుని వాహనంగా కలవాడు, శెల్వన్ = సంపద్రూపిణి అయిన లక్ష్మీదేవిని కలవాడు, ఎళిల్ అళన్దు ఎణ్ణఱ్కు అరియానై = అందంయొక్క అవధిని చూచి భావించడానికి వీలు కానివాడు, ఎప్పొరుట్కుమ్ శేయానై = అన్ని వస్తువులకు చాలా దూరంలో ఉన్నవాడు, నణ్ణఱ్కు అరియానై = (ఎవరికీ తమ స్వప్రయత్నంలో) దరిచేరడానికి వీలుకానివాడై ఉన్నవాడు అయిన భగవానుని, కళల్ = శ్రీచరణాలను, నామ్ తొళుదుమ్ = మనం నమస్కరిస్తాము, వా = నీవు కూడా అంగీకరించి, సహకరించి రా. (కైంకర్యరుచిని తెలిసి, నాకు వశంలో ఉండే ఓ మనసా ! కైంకర్యం చేయడం కోసం రా)

అవ :- "భగవత్కైంకర్యం చేయడానికి రా'' అని ఆళ్వార్లు తమ మనస్సును గత పాశురంలో పిలిచారు. ఒక ఇంద్రియంతో ఒక విధమైన కైంకర్యాన్ని చేస్తే చాలదు, అన్ని ఇంద్రియాలతో అతనిని అనుభవించి, పలు రీతులలోని కైంకర్యాలను చేయాలి- అని ఆ మనసుకు ఈ పాశురంలో ఉపదేశిస్తున్నారు.

8. **నామ మ్పలశొల్లి నారాయణా వెన్ఱు**
**నా మఙ్గైయాల్ తొళుతుమ్ నన్నెఞ్జే ! వా- మరువి**
**మణ్ణులక ముణ్డుమిళ్న్ద వణ్డఱైయుమ్ తణ్డుళాయ్**
**కణ్ణనైయే కాణ్గ నఙ్గణ్**

నల్ నెఞ్జే = (నాకంటే ముందడుగు వేసే) మంచి మనసా !, పల నామమ్ శొల్లి = పలు తిరునామాలను అనుసంధించి, నారాయణా ఎన్ఱు = అన్నిటిలోను ముఖ్యం

అయిన నారాయణ నామాన్ని పల్కి, అమ్ కైయాల్ = అందమైన హస్తంతో, నామ్ తొழுదుమ్ = మనం అంజలిని ఘటిద్దాం, మరువి వా = దీనికి నీవుకూడా ఒడంబడికతో రా (అంగీకరించి రా), మణ్ ఉలకమ్ = భూమిమొదలైన లోకాలను, ఉణ్డు ఉమిழ்న్ద = ప్రళయకాలంలో లోపల అణచి ఉండి, సృష్టికాలంలో వ్యక్తం చేసినవాడు, వణ్డు అறైయుమ్ తణ్ తుழாయ్ = తుమ్మెదలు చేరి ధ్వనించే చల్లని తులసీమాలను కలవాడు అయిన, అణ్ణలైయే = శ్రీకృష్ణునే, నమ్ కణ్ = మన కన్నులు, కాణ్గ = దర్శించి, ఆనందించాలి. (మనకు విధేయంగా ఉండే కన్నులు "అతనినే దర్శించాలి'' అనే ఆశ తీరేటట్లు దర్శించి, ఆనందించాలి అనిభావం.)

అవ :- **"కణ్ణనైయే కాణ్గ నమ్ కణ్"** అని వీరు ఆశపడిన తరువాతకూడా, ఆశ్రితపరతంత్రుడైన శ్రీకృష్ణుడు తన దర్శనాన్ని ప్రసాదించకుండా ఉండలేడే ! అతడు తనను తానే దర్శింపజేయగా దర్శించి, అందాన్ని ఇందులో అనుభవిస్తున్నారు.

**9. కణ్ణుమ్ కమలమ్ కమలమే కైత్తలముమ్**
**మణ్ణళన్ద పాతముమ్ మఱ్ఱవైయే- ఎణ్ణిల్**
**కరుమా ముకిల్వణ్ణన్ కార్క్కడల్ నీర్వణ్ణన్**
**తిరుమామణివణ్ణన్ తేశు**

కరు మా ముకిల్ వణ్ణన్ = నల్లని పెద్ద మేఘంవంటి రూపాన్ని కలవాడు, కార్ కడల్ నీర్ వణ్ణన్ = నల్లని నీటి రంగువంటి రంగును కలవాడు, తిరు మా మణి వణ్ణన్ = అందమైన, గొప్ప వెలను కల మణివంటి వర్ణాన్ని కలవాడు అయిన భగవానుని, తేశు = అందాన్ని, ఎణ్ణిల్ = లెక్కిస్తే, కణ్ణుమ్ = తిరునేత్రాలు, కమలమ్ = తామరపూలవంటివి, కై త్తలముమ్ = కరతలాలు, కమలమే = ఆ తామరపూలను పోలినవే, మఱ్ఱుమ్ = ఇంకా, మణ్ అళన్ద పాదముమ్ = లోకాలను కొలిచిన శ్రీపాదాలు, అవైయే = ఆ తామరపూలవంటివే.

ఆ అందానికి, సౌకుమార్యానికి జితులై పడేచోటు, అయిన అరణ్యాలతో, మిట్టలతో భూమిని కొలిచిన శ్రీపాదాలుకూడా ఆ కమలంవలె గొప్ప సౌకుమార్యాన్ని కల్గినవే. కఠినమైన భూమిని పూవువంటి ఆ శ్రీపాదాలతో స్వామి కొలువడమా! అని ఆழ்వార్లు ఆ స్థానే భయశంకతో కడుపు మోదుకొంటున్నారు.

అవ :- కొఱత లేని అందాన్ని కలవాడైన అతని అందాన్నిగూర్చి పల్కి, అనుభవించాలంటే తమకు కొన్ని గొప్పతనాలు కావాలి కదా ! వాటిని మేము ఏవిధంగా



పొందడం? అని అంటే, మనం అతని తిరునామాలను చెప్పడం ప్రారంభించినపుడే అన్ని గొప్పతనాలు తాము సార్థకం కావడంకోసం తమకు తాముగానే వచ్చి పొందుతాయి సుమా- అని ఇందులో అంటున్నారు.

**10. తేశుమ్ తిఱలుమ్ తిరువు మురువముమ్**
**మాశిల్ కుడిప్పిఱప్పుమ్ మఱ్ఱవైయుమ్- పేశిల్**
**వలమ్బురిన్ద వాన్శఙ్గమ్ కొణ్డాన్ పేరోత**
**నలమ్బురిన్దు శెన్ఱడైయుమ్ నన్గు**

వలమ్ పురిన్ద వాన్ శఙ్గమ్ కొణ్డాన్ = కుడివైపున దక్షిణావర్తాలను కల, తెల్లని పాంచజన్యాన్ని ధరించిన భగవానుని, పేర్ ఓద = తిరునామాలను చెప్పగా, పేశిల్ = (దాని ప్రయోజనాలను) చెప్పడం ప్రారంభిస్తే, తేశుమ్ = తేజస్సు, తిఱలుమ్= ప్రత్యర్థులను ఓడించే సామర్థ్యం, తిరువుమ్ = సంపద, ఉరువముమ్ = అందమైన రూపం, మాశు ఇల్ కుడి పిఱప్పుమ్ = దోషం లేని సత్కులజన్మ, మఱ్ఱవైయుమ్ = ఇంకా ఉండే గొప్పతనాలు అన్నీ, నలమ్ పురిన్దు నన్గు శెన్ఱు అడైయుమ్ = తామే ఆశపడి చక్కగా వచ్చి చేరుతాయి.

మనోరథాలను తీర్చి, చక్కగా వచ్చి చేరతాయి- అని భావం. **"నలమ్"** అంటే కోరిక. "ఇతని దగ్గరకు మనం వచ్చి చేరితే మనకు మంచిది'' అని భావించేటట్లు ఈ గొప్పతనాన్ని ఇతనిని స్వయంగా కోరివచ్చి చేరతాయి. చెడ్డవారి దగ్గరకు చేరితే సద్గుణంకూడా గౌరవింపబడనందువల్ల సత్పురుషులైన వీరిని ఆశ్రయిస్తేనే మనం సద్గుణాలుగా లెక్కింపబడతాం'' అని అవి భావించాయా ! అని శంకించేటట్లుగా ఈ గుణాలు వీరిని అన్వేషించి స్వయంగా ఆశ్రయిస్తాయని భావం.

అవ :- గడచిన పాశురంలో "తిరునామాలను చెప్పేవారికి తనను తానే దర్శింపజేసి, అన్ని ఫలాలను అనుగ్రహిస్తాడు'' అని అన్నారు. మిగిలిన ఎవరికీ తెలియడానికి అరుదైనవాడు భగవానుడు -అనే విషయాన్ని కారణం చూపి ఈ పాశురంలో వివరిస్తున్నారు.

**11. నన్గోతుమ్ నాల్ వేదత్తుళ్ళాన్ నఱవిరియుమ్**
**పొఙ్గోతరువి పున్నల్వణ్ణన్- శఙ్గోత**
**ప్పాఱ్కడలాన్ పామ్బణైయిన్ మేలాన్ పయిన్ఱురైప్పార్**

నూల్కడలాన్ నుణ్ణఱివినాన్

నన్గు ఓదుమ్ నాల్ వేదత్తు ఉళ్ళాన్ = దోషరహితంగా అధ్యయనం చేయబడే నాల్గు వేదాలచే ప్రతిపాదింపబడేవాడు, నఱవు ఇరియుమ్ = తేనె స్రవించేటట్లున్న భోగ్యతను కల్గినదై, పొఙ్గు ఓదమ్ అరువి పునల్ = సముద్రంలవలె, కొండవాగుల నీరువలె ఉండేది అయిన, వణ్ణన్ = తిరుమేనిని కలవాడు, శఙ్గు ఓదమ్ పాల్ కడలాన్= శంఖాలను కల అలలు కల్గినదైన క్షీరాబ్ధిలో శయనించి ఉండేవాడు, పామ్బు అణైయిన్ మేలాన్ = శేషశయనంలో శయనించి ఉండేవాడు, పయిన్ఱు ఉరైప్పార్ నూల్ కడలాన్= అభ్యసించి తెలియబడే వైదికుల, సముద్రంవంటి శాస్త్రాలచే చెప్పబడేవాడు అయిన స్వామి, నుణ్ అఱివినాన్ = (తమ ప్రయత్నంలో తెలిసేవారికి) తెలియరానివాడు.

స్వప్రయత్నంతో అతనిని తెలియాలని తలచేవారికి తెలియరానివాడని ఇచటి భావం. గత పాశురంలో చెప్పినరీతిలోనే అతడు స్వయంగా తనను దర్శింపజేస్తే దర్శించగలమే తప్ప, స్వప్రయత్నంతో దర్శించాలని అనుకొనేవారికి తెలియరానివాడని సారం. **"నుణ్ణఱివినాన్"**- జ్ఞానానికి సూక్ష్మమైనవాడని అర్థం. లేక, సూక్ష్మమైన జ్ఞానంతో తెలియదగినవాడు. అతడు తానే తనను దర్శింపజేసేవారికే అతనిని తెలియవచ్చు- అని, సూక్ష్మమైన జ్ఞానాన్ని కలవారు అతనిని తెలియవచ్చునే తప్ప "మన ప్రయత్నంతో అతనిని తెలియవచ్చు" అనే స్థూలమైన జ్ఞానాన్ని కలవారు అతనిని తెలియలేరని భావం.

అవ :- "స్వప్రయత్నంలో అతనిని తెలియడానికి ఎవరికీ సాధ్యం కాదా ? ఉపాయాంతరనిష్ఠులు అతనిని ప్రయత్నించి దర్శిస్తున్నట్లుగా శాస్త్రాలు తెలుపుతున్నాయే !" అని సందేహం రాగా, "ఇంద్రియనిగ్రహం మొదలైన పలు పడరాని పాట్లను పడి, ప్రయత్నించి, భక్తి యోగం చేజిక్కించుకొన్నవారు ఒక వేళ దర్శిస్తే ఎపుడైనా దర్శించవచ్చునేమో. ఆ విధంగా దర్శించడంలోని వైరల్యాన్ని చూచే (అరుదైన విషయం అనే విషయాన్ని చూచే) గత పాశురంలో స్వప్రయత్నంతో దర్శించలేనివాడు అని చెప్పబడింది- అని ఈ పాశురంలో అంటున్నారు.

**12.** అఱి వెన్నుమ్ తాళ్ కొళువి ఐమ్బులనుమ్ తమ్మిల్
శెఱి వెన్నుమ్ తిణ్ కతవమ్ శెమ్మి- మఱై యెన్ఱుమ్
నన్గోది నన్గుణర్‌వార్ కాణ్బరే నాడోఱుమ్
పైఙ్గోత వణ్ణన్ పడి

మఱై =వేదాన్ని, ఎన్ఱుమ్ = నిరంతరం, నన్గు ఓదు = చక్కగా అధ్యయనం చేసి, అఱివు ఎన్నుమ్ = (ఆత్మ- పరమాత్మ) జ్ఞానం అనే, తాళ్ కొళువి = తాళాలను పెట్టి, ఐమ్బులనుమ్ = అయిదు ఇంద్రియాలను, తమ్మిల్ శెఱివు ఎన్నుమ్ = తమకు తగిన విషయంలో అణచి ఉంచడమనే, తిణ్ కతవమ్ శెమ్మి = దృఢమైన తలుపులను మూసి, నన్గు ఉణర్‌వార్ = చక్కగా ధ్యానించేవారు, పైఙ్గోదమ్ వణ్ణన్ పడి = పచ్చని సముద్రవర్ణంవంటి వర్ణాన్ని కలవాడైన భగవానుని స్వభావాలను, నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, కాణ్బర్ = సాక్షాత్కరించుకొంటారు.

**"సదా పశ్యంతి"** అనే రీతిలో ఈనాడు- ఆనాడు అనే భేదంలేకుండా ఎల్లప్పుడూ దర్శించగలరు. ఉపాయాంతరనిష్ఠులు అతనిని తెలియడానికి పడే పాట్లను వివరించడంతోపాటు, గడచిన పాశురంలో **"నుణ్ణఱివినాన్"** అనే తమ ప్రయత్నంలో తెలియడానికి సాధ్యం కానివాడని అంటూ పల్కిన దానినే ఇక్కడ వివరించినట్లయింది.

అవ :- గత పాశురంలో చెప్పిన రీతిలోనే తమ ప్రయత్నంతో అతనిని చూడాలని ప్రయత్నించేవారికి క్లేశం ఉంటుందే తప్ప, అతడే తన గొప్పతనాలను దర్శింపజేయగా దర్శించిన తాము ఏ క్లేశం లేకుండా దర్శిస్తాము- అని అంటూ, ఒక చేష్టితాన్ని తాము దర్శించిన రీతినిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

**13.** పడివట్ట త్తామరై పణ్డులకమ్ నీరేఱ్ఱు
అడివట్టత్తాలళప్ప నీణ్డ-ముడివట్టమ్
ఆకాయ మూడఱుత్తు అణ్డమ్బోయ్ నీణ్డతే
మాకాయమాయ్ నిన్ఱ మాఱ్కు

పణ్డు = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకమ్ నీర్ ఏఱ్ఱు = (మహాబలిదగ్గర) భూమిని దానంగా పరిగ్రహించి, తామరై పడి వట్టమ్ = తామరపూవు పూచినట్లుగా గుండ్రంగా ఉండే భూమి, అడి వట్టత్తాల్ అళప్ప = శ్రీపాదవలయంతో కొలవడం కోసం, మా కాయమ్ ఆయ్ నిన్ఱ మాఱ్కు = గొప్ప తిరుమేనిగా (త్రివిక్రముడై) పెరిగిన భగవానుని, నీణ్డ ముడి వట్టమ్ = దీర్ఘమైన కిరీటవలయం, ఆకాయమ్ ఊడు అఱుత్తు = పైలోకాల మార్గంలో పయనించి, అణ్డమ్ పోయ్ నీణ్డదే = అండకటాహం వరకు వృద్ధి చెందింది కదా! ఇదేమి ఆశ్చర్యం!

**"స భూమిం విశ్వతో వృత్వా, అధ్యతిష్ఠ ద్దశాంగులమ్"** అనే రీతిలో రక్ష్యవస్తువు పరిమితి మాత్రంలోనే అణగి ఉండని రక్షకుని అభినివేశాతిశయం చేత, అండభిత్తివరకు

చేరి దానిని అతిక్రమించి ఆవలివైపు కూడా పోయిందే! ఇదేమి ఆశ్చర్యం!- అని విస్మితులవుతున్నారు.

అవ :- "అఱివెన్నుమ్ తాళ్ కొళువి" అనే పాశురంలో "ఐమ్బులనుమ్ తమ్మిల్ శెఱి వొన్నుమ్ తిణ్ కతవుమ్ శెమ్మి" అని యోగాభ్యాసంతో శుభాశ్రయం అయిన అంతర్యామి రూపంలో మనస్సును ప్రవర్తింపజేసేవారికి ఇంద్రియాలను జయించవచ్చునని, ఈ విధంగా ఇంద్రియాలను జయించినవారికి తప్ప ఇంకొకరికి అతనిని దర్శించడం సాధ్యం కాదు -అని అన్నారు. ఈ విధంగా యోగాభ్యాసం చేయలేని అశక్తులు శుభాశ్రయం అయిన తిరుమేనిలో మనస్సు లగ్నం చేయలేరు కనుక, వారు ఇంద్రియాలను జయించడం, అతనిని దర్శించడం అరుదుకదా !- అనే ప్రశ్న తల ఎత్తగా, "ఈ యోగాభ్యాసంతో అంతర్యామిని దర్శించి, ఇంద్రియాలను జయించేటట్లుగా శుభాశ్రయం అయిన తిరుమేనితో తిరుమలైలో అర్చావతారంగా వచ్చి నిలచి సులభుడయ్యాడు. అందువల్ల తమవలె అతడే తానుగా దర్శింపజేయగా దర్శించడం కాకుండా, అశక్తులు కూడా అతనిని సులభంగా ఆశ్రయించి తరించ వచ్చును'' అని ఈ పాశురంలో అంటున్నారు.

**14. మాల్పాల్ మనమ్ శుழிప్ప మఙ్గైయర్తోళ్ కైవిట్టు**
**నూల్పాల్ మనమ్ వైక్క నొయ్విత్తామ్- నాల్పాల**
**వేతత్తాన్ వేఙ్గడత్తాన్ విణ్ణోర్ ముడి తోయుమ్**
**పాతత్తాన్ పాతమ్ పణిన్దు**

నాల్పాల్ వేదత్తాన్ = నాల్గుగా విభాగింపబడ్డ వేదాలలో చెప్పబడేవాడు, వేఙ్గడత్తాన్= తిరుమలలో నిలచిన సౌలభ్యాన్ని కలవాడు, విణ్ణోర్ ముడి తోయుమ్ పాతత్తాన్ = నిత్యసూరుల కిరీటం పొందికగా ఉండే శ్రీచరణాలను కల స్వామియొక్క, పాదమ్ = శ్రీచరణాలను,పణిన్దు = ఆశ్రయించి, మాల్ పాల్ = ఆ సర్వేశ్వరునివద్ద, మనమ్ శుழிప్ప = మనస్సు చుట్టుకోగా (అభినివేశాన్ని పొందగా), (అందువల్ల), మఙ్గైయర్ తోళ్ కై విట్టు = వనితల అందమైన బాహువులు ఆలిగనం చేసికోవాలి- అనే ఆశను విడిచిపెట్టి, నల్ పాల్ = వేదం మొదలైన శాస్త్రాలలో, మనమ్ వైక్క = మనస్సు ప్రవర్తింపజేయడానికి, నొయ్విదు ఆమ్ = సులభం అవుతుంది.

పూర్వం తెల్పిన రీతిలో లౌకిక విషయానుభవాలు తీరగానే, వేదం మొదలైన శాస్త్రాలలో కొంచెం అయినా మనస్సును నిలువడానికి వీలవుతుంది. మనస్సును అగ్నం చేయగానే తగిన ఉపాయాన్ని అనుష్ఠించి, అతని పొందడం సులభం- అని భావం.

అవ :- గడచిన పాశురంలో భగవానుని పొందడానికి దుర్లభమైన దారిని, సులభమైన దారిని రెండిటిని చూపారు. మఱి ఈ మార్గాలలో ఏ దారిలో మీరు ప్రయత్నించి, అతనిని దర్శించారు? అనే ప్రశ్న తల ఎత్తగా, అతడు తానే నా మనసులో ప్రవేశించి, నిర్హేతుకంగా తనను దర్శింపజేయగా దర్శించిన నాకు ఈ రెండు దారుల లోను శ్రమ ఏ కొంచెంకూడా లేదు- అని అంటున్నారు.

**15. పణిన్దుయర్న్ద పౌవ ప్పడుతిరైకళ్ మోత**
**పణిన్ద పణమణికళాలే- అణిన్ద-**
**అనన్దనణై క్కిడక్కు మమ్మాన్ అడియేన్**
**మనన్దనణై క్కిడక్కుమ్ వన్దు**

పణిన్దు ఉయర్న్ద = (భగవానుని స్పృశించాలనే ఆరాటంతో) పడుతూ, పైకి లేస్తూ ఉండే, పౌవమ్ పడు తిరైకళ్= సముద్రంలోని కెఱటాలు, మోద = అన్నివైపులా తాకుతూ ఉండగా, పణిన్ద = (ఆ అలల నీటి కణాలు తిరుమేనిపై పడగలపై ఉండే, మణికళాలే = మాణిక్యాలతో, అణిన్ద = అలంకరింపబడ్డ, అనన్తన్=అనంతుడనబడే, అణై= శయ్యపై, కిడక్కుమ్ = శయనించి ఉండే, అమ్మాన్ = సర్వేశ్వరుడు, (అ పడుకపై పొందికగా ఉండ లేకుండా), అఙ్గు = అక్కడనుండి, వన్దు = బయలుదేరి, అడియేన్తన్ = దాసుని, మనమ్ అణై = మనస్సు అనే పడుకలో, కిడక్కుమ్ = నిద్రిస్తున్నాడు.

ఆ పెద్దపడుకపై శయనించి ఉండేవాడు, ఆదిశేషునివలె తన విషయంలో అభినివేశాన్ని కల్గి ఉండనివాణ్ణి అయిన సౌకుమార్యం, చల్లదనం, సౌగంధ్యం- మొదలైన శయనానికి ఉండదగిన గుణాలు ఏవీ లేని నా కఠినమైన మనస్సులో నిలచాడు. గతంలో ఎక్కడ పరుండి ఉండేవాడు ఇపుడు ఎక్కడ శయనించాడు ! ఉండడానికి చక్కని చోటు, శయనించడానికి పడుక లేనివానికి అంతఃపురంలో మెత్తని పంచశయనం లభించినట్లుగా, ఆ అరుదైన శయ్యాన్ని వీడి ఈ రాతి మనస్సును ఆదరించాడే ! అయోధ్యాపురవాసులు "అయోధ్యకు తిరిగి వేంచేయాలి'' అని అతనిని శరణు వేడినపుడు, వారిని విడిచిపెట్టి **"ఆవాసం త్వహ మిచ్ఛామి"** (నాకొక నివాసాన్ని

కోరుతున్నాను) అని అంటూ ఋషులవద్ద ప్రార్థించినట్లుగా ఉన్నది ఇది -అని హార్ద భావం. ఈ విధంగా అత్యంతాభినివేశంతో అతడు నన్ను అన్వేషించి వచ్చినందువల్ల అతనిని ప్రయత్నించి పొందే ఆ దారిలో నేను శ్రమపడలేదు- అని చెప్పినట్లయింది.

అవ :- ఈ రీతిలో తాము పరగతస్వీకారానికి విషయం కావడానికి కారణం ఏమి? అని అంటే, పాలసముద్రంనుండి లేచి వచ్చి- "ఎవడైనా ఒక చేతనుడు లభించడా!" అనే ఆశతో తిరువళ్ళిక్కేణికి వేంచేసినపుడు- "ఇదిగో ! ఈ సమీపంలో జన్మించిన ఇతనిని కటాక్షించాలి" అని అంటూ లక్ష్మీదేవి పురుషకారం చేయడమే- అని అంటున్నారు.

16. వన్దుదైత్త వెణ్ తిరైకళ్ శెమ్బవళ వెణ్ ముత్తమ్
అన్ది విళక్కు మణివిళక్కామ్-ఎన్దై
ఒరువల్లి త్తామరైయాళ్ ఒన్టియ శీర్ మార్వన్
తిరువల్లిక్కేణియాన్ శెన్టు

ఒరు అల్లి తామరైయాళ్ = సాటి లేని, అందమైన రేకులను కల తామర పూవును నివాసంగా కల లక్ష్మీదేవి, శెన్టు ఒన్టియ శీర్ మార్బన్ = వచ్చి పొందికగా ఉండే అందమైన వక్షస్సును కలవాడు, వెణ్ తిరైకళ్ వన్దు ఉదైత్త శెమ్ పవళమ్ వెణ్ ముత్తమ్ =తెల్లని అలలు తాకగా గెంటబడ్డ ఎట్టని పగడాలు, తెల్లని ముత్యాలు, అన్ది విళక్కుమ్ అణి విళక్కుమ్ ఆమ్ = సాయం సమయాన్ని ప్రకాశింపజేసే మంగళదీపాలు కాగా, తిరువల్లిక్కేణియాన్ = తిరువల్లిక్కేణిలో వేంచేసి ఉండేవాడు, ఎన్దై = నాకుస్వామి.

లక్ష్మీదేవి స్వయంగా ఆశపడి వచ్చి చేరిన వక్షఃస్థలాన్ని కలవాడు, తిరువల్లిక్కేణిలో నిత్యవాసాన్ని చేసేవాడే స్వామి. ఆమె చేసినపురుషకారంయొక్క ఫలంవల్లనే నేను అతనివల్ల ఆదరింపబడి, విషయీకరింపబడ్డాను. ఆ తల్లి స్వయంగా అన్వేషించి అతనిని చేరి, అతనిని నేనుండే చోటుకు వెదకివచ్చేటట్లు చేసింది కదా ! అని ఆశ్చర్యపడు తున్నారు.

అవ :- ఈ విధంగా లక్ష్మీదేవితోపాటు భగవానుడుకూడి ఉండడంవల్ల నేను ఫలం పొందడంలో ఏ కొఱతా లేదు. ఈవిధంగా అతడు మనవద్ద అభినివేశాన్ని పొందినవాడు- అని తెలిసే ఒకనాడు ఉంటే, దానికి ముందు వెనుక ఉండే అన్ని దినాలు ఫలవంతాలు అవుతాయి. ఇక, నానోరు పొద్దు పుచ్చడానికి వీలుగా అతనిని విడువకుండా స్తుతించాలి- అని అంటున్నారు.

17. శెన్టనాళ్ శెల్లాత శెజ్గణ్మాల్ ఎజ్గళ్మాల్
ఎన్టనాళెన్నాళుమ్ నాళాకుమ్- ఎన్టుమ్
ఇఱవాత వెన్దై యిణైయడిక్కే యాళాయ్
మఱవాతు వాయ్తుక వెన్ వాయ్

శెమ్ కణ్ మాల్ ఎజ్గళ్ మాల్ ఎన్ట నాళ్ = పుండరీకాక్షుడు నాపట్ల అంతులేని ప్రేమను కలవాడై ఉన్నాడు అని చెప్పబడే నాళ్ళు (దినాలు) ఉంటే, శెన్ట నాళ్ = గతంలో గడచిన కాలం, శెల్లాద (నాళ్)= ఇకపై రాబోయే దినాలు-అనే, ఇన్నాళుమ్ = అన్ని కాలాలు, నాళ్ ఆకుమ్ = మంచి కాలమే అవుతుంది, ఎన్టుమ్ ఇఱవాత ఎన్దై = ఏనాడూ నాశనం లేని తండ్రి అయిన భగవానుని, ఇణై అడిక్కే = రెండు శ్రీచరణాలకే, ఆళ్ ఆయ్ = సేవకులమై, మఱవాదు = మఱువకుండా, ఎన్ వాయ్ వాయ్తుక = నానోరు స్తుతించాలి.

నా వాగింద్రియం క్షణంకూడా మఱవకుండా స్వామికి మంగళాశాసనాన్ని చేయాలి అనిభావం. ఇక్కడ వాక్కు మంగళాశాసనం చేయడాన్ని ప్రస్తావించడం- మిగిలిన కరణాలైన మనస్సు, కాయం, వాటికి సంబంధించిన రీతులలో కైంకర్యాన్ని చేయడం -అనే వీటికి ఉపలక్షణం. అందువల్ల ఫలంలో ఏ కొఱత లేనందువల్ల త్రికరణాలద్వారా కైంకర్యాన్ని చేయడమే అధికారికృత్యం- అని చెప్పబడినట్లయింది.

అవ :- ఈ రీతిలో కైంకర్యాన్ని చేయడానికి అతని అంగీకారం ఆవశ్యకం కనుక, "నీ సొత్తు ఏకొంచెం కూడా జారవిడువని నీవు, శ్రీపాదాలలో నిత్యకైంకర్యాన్ని అనుగ్రహించి, దానికి అడ్డు అయిన సంసారభయాన్ని తీర్చాలి" అని స్వామిని ఇందులో ప్రార్థిస్తున్నారు.

18. వాయ్ మొழிన్దు వామననాయ్ మావలిపాల్ మూవడి మణ్
నీ యళన్దుకొణ్డ నెడుమాలే! తావియ నిన్
ఎఞ్జా విణైయడిక్కే యేழ் పిఱప్పు మాళాకి
అఞ్జాతిరుక్క వరుళ్

వామనన్ ఆయ్ = వామనరూపియై, మా వలి పాల్ = మహాబలివద్దకు (పోయి, వాయ్ మొழிన్దు = (బాల్యాన్ని వ్యక్తం చేసే కొన్ని) పలుకులను పల్కి, మూ అడి మణ్ = మూడు అడుగుల నేలను (యాచించి పొంది), అళన్దు కొణ్డ = దానిని కొలిచిన, నెడుమాలే = సర్వేశ్వరా !, ఎఞ్జా = (అందంలో) ఏ మాత్రం సంకోచం

లేనిదై, తావియ = లోకాలను కొలిచిన, నిన్ ఇణై అడిక్కే = నీ శ్రీచరణాలకే, ఏழ் పిఱప్పుమ్ = అన్ని జన్మలలో, ఆళ్ ఆకి = నేను దాసుడనై, అఞ్జాదు ఇరుక్క = భయం లేకుండా ఉండేటట్లు, నీ అరుళ్ = నీవు కృపజేయాలి.

ఆ కైంకర్యానికి లోపం కలుగకుండా ఏం చేయగలను ? అని భయపడకుండా నేను ఏ సంకోచం, క్లేశం లేకుండా ఉండేటట్లుగా చేయడమే నీవు నాకు చేయవలసినది. ఈకృపను నీవు చేసేటట్లయితే ఎన్ని జన్మలను ఈ తమోమయలోకంలో నేను ఎత్తినా నాకు అది మోక్షంతో సమానం అవుతుంది- అని భావం. **"తూఙ్గార్ పిఱవిక్కళ్ ఇన్నమ్ పుకప్పెయ్దు వాఙ్గాయ్ ఎన్ఱు శిన్దిత్తు నాన్ అదఱ్కు అఞ్జి పామ్బోడు ఒరు కూఱైయిలే పయిన్ఱాప్పోలే తాఙ్గాదుళ్ళమ్ తళ్ళుమ్ ఎన్ తామరైక్కణ్ణా"** (పెరియతిరు-11-8-3) అనే రీతిలో సంసారంలో జన్మ ఎత్తడం సర్పంతో సహవాసం చేయడంవలె భయంకరమైనది- అని జ్ఞానులు అంటూ ఉండగా, జన్మలు ఎత్తాలని ఆశపడడం తగునా? అని అంటే, సర్పవిషాన్ని తీర్చే మూలికలను తిని, శరీరాన్ని బలిష్ఠంగా చేసికొన్నవాడు భయం ఏమీ లేకుండా పాము నోట్లో చేయిపెట్టడాన్ని లోకంలో గమనిస్తున్నాము. అదే రీతిలో, సంసారమోక్షస్థితిబంధహేతువు అయిన అతని కృప అనే ఔషధం దొరికితే, సంసారమనే కాలసర్పం నోటిలో ప్రవేశించి బయటకు రావడంలో అడ్డులేదు కదా ! అతని కృప లభిస్తుందా, లభించదా- అనే భయపడినపుడు జన్మలు భయంకరాలుగా ఉంటాయి. అతని కృప లభించడం తథ్యం- అని స్పష్టమైనపుడు భయం తీరి, జన్మలే ఉద్దేశ్యాలు అవుతాయి -అని గ్రహించాలి.

అవ:- **"అఞ్జాదిరుక్క అరుళ్"** అని అతనిని నిర్బంధించగానే, అతడు కృప జేయకుండా ఉంటాడా ! మన యోగ్యతారాహిత్యాన్ని గమనించి, మనలను అతడు అలక్ష్యం చేసినా చేయవచ్చు. బలమైన పాపాన్ని చేసిన మనం మన కార్యాన్ని చేయడంలో శక్తి లేనివారమై ఉండవచ్చు'' అని మనస్సు వెనుకంజ వేయడం ఆరంభించగానే, "అతడు మన కార్యాన్ని చేయడానికి తగిన శక్తిని కలవాడే''. మన యోగ్యతారాహిత్యాన్ని చూచి, చేయివిడువడులే'' అని తమ మనస్సుకు ఊఱటను కల్గించే మాటలను ఇందులో పల్కుతున్నారు.

**19.** అరుళాతొழியుమే యాలిలైమేల్ అన్ఱు
తెరుళాద పిళ్ళైయాయ్ చ్చేర్న్దాన్- ఇరుళాత
శిన్దైయరాయ్ చ్చేవడిక్కే శెమ్మలర్తూయ్ క్కైతొழுతు
మున్దైయరాయ్ నిఱ్పార్క్కు మున్

ఇరుళాద శిన్దై ఆయ్ = అజ్ఞానాంధకారం చేరని మనస్సును కలవారై, శే అడిక్కే= ఎఱ్ఱని శ్రీపాదాలకే, శెమ్ మలర్ తూయ్ = అందమైన పుష్పాలను సమర్పించి, కై తొழுదు = అంజలి చేసి, మున్దైయర్ ఆయ్ నిఱ్పార్క్కు = (భగవద్విషయంలో) ముందంజ వేసి నిలిచే భక్తులకు, అన్ఱు = పూర్వ ఒకానొక సమయంలో, తెరుళాద పిళ్ళై ఆయ్ = ఏమీ తెలియని చిన్న శిశువై, ఆల్ ఇలై మేల్ శేర్న్దాన్ = మఱ్ఱి చిగురుటాకుపై నిద్రించిన స్వామి, మున్ అరుళాదు ఒழிయుమే =ముందడుగు వేసి కృపజేయకుండా పోతాడా! (అతని విషయంలో మనం ముందుకువస్తే మనలను కృపజేయడానికి అతడు ముందడుగు వేస్తాడు కదా- అని కూడా భావం.)

అవ :- ప్రయోజనాంతరపరులై, నిన్ను కోరేవారికికూడా నీ స్వభావాన్ని మార్చుకొని, కార్యాన్ని చేసే నీవు అనన్యప్రయోజనులం అయిన మా కార్యాన్ని చేయవా?- అని ప్రశ్నిస్తున్నారు.

**20.** మున్నులక ముణ్డుమిழ்న్దాయ్క్కు అవ్వులక మీరడియాల్
పిన్నళన్దు కోడల్ పెరితొన్ఱే-ఎన్నే
తిరుమాలే ! శెఙ్గణెడియానే ! ఎఙ్గళ్
పెరుమానే ! నీ యితనై ప్పేశు

మున్ = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకమ్ = లోకాలను అన్నిటినీ, ఉణ్డు = తన ఉదరంలో పెట్టుకొని, ఉమిழ்న్దాయ్క్కు = అనంతరం బయటపఱచిన నీకు, అవ్వులకమ్ = ఆ లోకాలను, పిన్ = తరువాత ఒకానొక సమయంలో, ఈర్ అడియాల్ = రెండు శ్రీపాదాలతో, అళన్దు కోడల్ = కొలువడం అనేది, పెరిదు ఒన్ఱే = అది ఒక పెద్ద కార్యం అవుతుందా ? (కానే కాదు), తిరుమాలే = ఓ శ్రియఃపతీ !, శెమ్ కణ్ నెడియానే =ఎఱ్ఱని తిరునేత్రాలను కల సర్వాధికా !, ఎఙ్గళ్ పెరుమానే = మాకు స్వామి అయినవాడా !, నీ ఇదనై పేశు = నీవు దీనిని నాకు తెలిసేటట్లుగా చెప్పాలి, ఎన్నే ! = ఇదేమి ఆశ్చర్యం !

ఈ విధంగా అందరికంటే గొప్పవాడైన నీవే దీనిని చెప్పాలి. **"ఎత్తిఱమ్"** అని అన్న నమ్మాழ்వార్లవలె ఇక్కడ సౌలభ్యగుణంలో పేయాழ்వార్లు అభినివేశాన్ని పొందుతున్నారు. ప్రయోజనంతరపరుడైన ఇంద్రుడు "నేను కోల్పోయిన రాజ్యాన్ని సాధించి ఇవ్వాలి'' అని ప్రార్థించగా, నీ ఆశ్రితపక్షపాతంవల్ల ఈ లీలను చేసిన నీవు, అనన్య ప్రయోజనులం అయిన మా కార్యాన్ని తప్పక తీరుస్తావులే- అని భావం.

అవ :- పూర్వం, వసిష్ఠ- చండాలతారతమ్యం లేకుండా అందరి శిరస్సులను తన శ్రీచరణాలతో తడవిన త్రివిక్రమునిగూర్చి ప్రస్తావించడంవల్ల అతనివలె ఏ వ్యత్యాసాన్ని చూడకుండా స్త్రీ- బాలురకుకూడా కట్టడానికి, కొట్టడానికికూడా వీలయేటట్లుగా తనను వారి వశం చేసికొన్న శ్రీకృష్ణునిగూర్చి ప్రస్తావిస్తూ "ఆ స్వామిని పరిచ్ఛేదించి పల్కడం ఎవరికీ సాధ్యం అయే పని కాదు సుమా !'' అని అంటున్నారు.

21. పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే
వాశమలర్ త్తుళ్ాయ్ మాలైయాన్- తేశుడైయ
శక్కరత్తాన్ శఙ్గినాన్ శార్ఙ్గత్తాన్ పొఙ్గరవ
వక్కరనై క్కొన్రాన్ వడివు

వాశమ్ మలర్ తుళ్ాయ్ మాలైయాన్ = సువాసన నిండుగా ఉండే పూవులతో కూడిన తులసీమాలను అలంకరించుకొన్నవాడు, తేశు ఉడైయ శక్కరత్తాన్ = కాంతిని కల్గిన శ్రీసుదర్శనాన్ని ధరించినవాడు, శఙ్గినాన్ = శ్రీపాంచజన్యాన్ని ధరించినవాడు, శార్ఙ్గత్తాన్ = శార్ఙ్గం అనే వింటిని దరించినవాడు, పొఙ్గు అరవమ్ వక్కరనై = గొప్ప కలవరాన్ని చేస్తూ వచ్చిన దంతవక్రుడనే అసురుని, కొన్రాన్ = సంహరించినవాడైన భగవానుని, వడివు = స్వభావాలు, (ఎటువంటివి ? అని అంటే),పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే =కీర్తించేవారు తాము ఎంతవరకు కీర్తించగలరో తావన్మాత్రమే అని కాగలవు.

జ్ఞానంలో అధికులైనా, తక్కువవారైనా- అందఱూ భగవానుని రూపాన్ని యథాతథంగా పూర్ణంగా వర్ణించలేకపోవడమనే విషయంలో సమానులే - అన్నది ఈ పాశురసారం. ఈ అంశాన్ని ఆళవందార్ స్తోత్రరత్నంలో **"యద్వా శ్రమావధి"** అనే శ్లోకంద్వారా అనుసంధించారు.

అవ :- అతని స్వరూపస్వభావాలు పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కానివి అయిన తరువాత, "అతడు తానే తనను దర్శింప జేస్తే, అందంగా దర్శించాలి అనే కోఱికను కల్గి ఉండు'' అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఆళ్వార్లు అనుగ్రహిస్తున్నారు.

22. వడివార్ ముడికోట్టి వానవర్కళ్ నాళుమ్
కడియార్ మలర్ తూవి క్కాణుమ్- పడియానై
శెమ్మైయాలుళ్ళురుకి చ్చెవ్వనే నెఞ్జమే !
మెయ్మ్మైయే కాణ విరుమ్బు

నెఞ్జమే = ఓ మనసా !, వానవర్కళ్ = నిత్యసూరులు, వడివు ఆర్ = అందం నిండిన, ముడి = కిరీటాలను, కోట్టి = నమస్కరించేటట్లుగా చేసి, కడి ఆర్ మలర్ = సువాసన నిండిన పూవులను, నాళుమ్ =ప్రతిదినం, తూవి = (క్రమ వివక్ష లేకుండా) సమర్పించి, కాణుమ్ పడియానై = సదా దర్శించదగిన తిరుమేనిని కలవాడైన స్వామిని, శెమ్మైయాల్ = శేషశేషిభావక్రమానుసారంగా, ఉళ్ ఉరుకి = మనస్సులో కఱగి, శెవ్వనే = ఋజువైన మార్గంలో, మెయ్మ్మైయే = యథాతథంగా (నిజంగా), కాణ = సేవించడానికి, విరుమ్బు =ఆశపడు.

ఏదో ఒక గుణాన్ని అతడు ప్రదర్శించినంతమాత్రంతో చాలు- అని భావించకుండా, పరిపూర్ణంగా సాక్షాత్కరించుకోవాలని ఆశపడు. **"మెయ్మ్మైయే"** అంటే పరిపూర్ణంగా- అని అర్థం. లేక, ఇంకొక ప్రయోజనాన్ని ఆశించి, అతనిని దర్శించాలని అనుకోవడం అసత్యదర్శనంగా గ్రహించి, వేఱొక ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, అతనిని దర్శించడమే పరమ ప్రయోజనంగా భావించి, దర్శించే నిజమైన దర్శనాన్ని దర్శించాలని చూడు- అని కూడా చెప్పవచ్చు. **"నెఞ్జమే"** అనే సంబోధనకు- నాకంటే ముందడుగువేసే మనసా! అని, శేషశేషిభావాన్ని బాగా తెలిసిన మనసా! అని, స్వప్రయత్నంతో భగవానుని ఎవరూ తెలియలేరని భాగా గ్రహించిన మనసా! అని- ఈ విధంగా పలు విధాలుగా భావాలను ప్రకరణానుగుణంగా చెప్పవచ్చు. కనుక, అతడు తనకు తానే తనను దర్శింపజేయాలి- అని ఆశపడి, తన ప్రయత్నంనుండి విరమించడమే ప్రపన్నుని స్వరూపం అని ఇక్కడ తెలుపబడింది.

అవ :- **"కాణ విరుమ్బు"** అని అంటూ వీరు ఉపదేశించి, ముగించడానికి ముందే, వీరి మనస్సు భగవానుని శ్రీపాదాలలో గొప్ప భక్తిని కల్గి ఉన్న రీతినిగూర్చి ఆళ్వార్లు ఇందులో ఆశ్చర్యపడుతున్నారు.

23. విరుమ్బి విణ్ మణ్ణళన్ద అఞ్జిఱైయ వణ్డార్
శురుమ్బు తుళైయిల్ శెన్రూత -అరుమ్బుమ్
పునన్దుళ్ాయ్మాలైయాన్ పొన్నఙ్గళ్ాల్కే
మనమ్ తుళ్ాయ్ మాలాయ్ వరుమ్

అమ్ శిఱైయ వణ్డు = అందమైన రెక్కలను కల ఆడు తుమ్మెదలు, ఆర్ శురుమ్బు = వాటిని విడువకుండా ఉండే మగ తుమ్మెదలు, తుళైయిల్ శెన్రు ఊద = వెదురు గొట్టాలలో దూరి ధ్వనించగా, (దానివల్ల), అరుమ్బుమ్ = వికసించిన, పునమ్

తుళాయ్ మాలైయాన్ = తోటలోవలె వికాసం మాఱని తులసీమాలను అలంకరించుకొన్న భగవానునియొక్క, విరుమ్బి విణ్ మణ్ అళన్ద అమ్ కళల్కే = ఆశపడి పరమపదాన్ని, భూలోకాన్ని కొలిచిన, చాలా అందం అయిన స్వామి శ్రీపాదాల విషయంలో, మనమ్ = నా మనస్సు, తుళాయ్ = పరిపూర్ణంగా, నిమగ్నమై, మాల్ ఆయ్ వరుమ్ = అంతు లేని వ్యామోహాన్ని కల్గి ఉన్నది. (లేక, ఆశపడి తులసీమాలగా పరిణమిస్తున్నది- అని కూడా చెప్పవచ్చు).

మనస్సు అనేది దేనినైనా ఆశపడి, ఆ ఆశతో ముందడుగు ఏదో తెలియక, నిలుచున్న చోటులో తడబడుతూ, మైకమే మూర్తీభవించిందా అనేటట్లుగా ఆ శ్రీచరణాలలో వ్యామోహాన్ని పొందుతుంది. కనుక, **"కాణా విరుమ్బు"** అని ఉపదేశించగానే, మనోరథం యొక్క ఉన్నతదశలో తమ మనస్సు ఉండడాన్ని చూచి, ఆశ్చర్యపడి ఈ పాశురాన్ని ఆళ్వార్లు అనుగ్రహించారు.

అవ:- "ఓమనసా! అంతు లేని ప్రేమను కల్గి ఉండి, భగవానునివద్ద అభినివేశాన్ని పొందాము. ఇక చేయవలసినది ఏదీ లేదు.'' అనే గర్వాన్ని పొందకుండా, అతని విషయంలో ఉత్కటమైన ప్రేమలో నిమగ్నమై ఆశ్రయించి, దానివల్ల కల్గిన అనుభవానికి విచ్ఛేదం లేకుండా ఉండేటట్లు నిరంతరం అతనిని అనుభవించాలని చూడు'' అని తమ మనస్సును చూచి, ఆళ్వార్లు అనుగ్రహిస్తున్నారు.

**24. వరుజ్గా లిరునిలనుమ్ మాల్ విశుమ్బుమ్ కాఱ్ఱుమ్**
**నెరుజ్గు తీ నీరురువు మానాన్- పొరున్దుమ్**
**శుడరాళి యొన్టుడైయాన్ శూళ్కళలే నాళుమ్**
**తొడరాళి నెఞ్జే ! తొళుతు**

ఆళి నెఞ్జే = సముద్రంవలె గాంభీర్యాన్ని, విస్తీర్ణాన్ని కల ఓమనసా !, ఇరు నిలముమ్ = విస్తృతిని కలభూమి, మాల్ విశుమ్బుమ్ = (ఆ భూమివలెనే) కొలువడానికి సాధ్యం కానట్లున్న చాలా పెద్దదైన ఆకాశం, కాఱ్ఱుమ్ = ఆ భూమిలో , ఆకాశంలో ఉండేవారికి ప్రాణాలను ఇచ్చే వాయువు, నెరుజ్గు తీ = భూమి, వాయువువలె సంతతిరూపంగా ఉన్నా, విడదీసి చూడడానికి వీలు లేని రీతిలో చాలా స్నిగ్ధంగా ఉండే (దగ్గరగా చేరి ఉండే) తేజస్సు, నీర్ = వీటిని అన్నిటిని ఒకటిగా చేర్చే జలం- అనే, ఉరువుమ్ ఆనాన్ = పంచభూతాలకు అంతర్యామి అయినవాడు, పొరున్దుమ్ శుడర్ ఆళి ఒన్టు ఉడైయాన్ = తన అప్రాకృతరూపానికి తగిన, సాటి లేని జ్యోతిని కల చక్రాయుధాన్ని కలవాడు అయిన భగవానునియొక్క, శూళ్ కళలే = భక్తులను వశీకరించుకొనే శ్రీచరణాలనే, వరుజ్కాల్ నాళుమ్ = ఇకపై రాబోయే కాలం అంతా, తొళుదు = నమస్కరించి, తొడర్ = అనుసరించి ఆశ్రయించు.

రాబోయే కాలంలో అంతా ఒక్కక్షణం కూడా తెలియకుండా, దినం అంతా ఆ శ్రీచరణాలనే అనుసరించి ఆశ్రయించి, అనుభవించు. దానికి ముందు అనాదిగా ఆ దివ్యరూపాన్ని స్మరించకుండా అనర్థాన్ని పొందినది చాలు - ఇక నీవైనా నిరంతరం క్రమానుసారం ఆశ్రయించు- అని మనస్సును ఉద్బోధిస్తున్నారు.

అవ :- ఆళ్వార్లు ఈరీతిలో ఉపదేశించినా, అనాదికాలంగా ఈ శ్రీచరణాన్ని ఆశ్రయించడానికి ఏర్పడిన అంతరాయాలను తలచి, "ఇకపై ఇంకా ఏమేమి ఆటంకాలు కల్గుతాయో! ఏమో!'' అని భయపడే తమ మనస్సును ఉద్దేశించి, "అతనిని నీవు అనుసరించి ఆశ్రయించిన తరువాత అన్ని అంతరాయాలు తొలగిపోతాయి. నీకు ఏ కొఱత లేదు భయపడకు'' అని దానిని తేటపరుస్తున్నారు.

**25. తొళుతాల్ పళుదుణ్డే తూ నీరులకమ్**
**ముళుతుణ్డు మొయ్కుళలాళాయ్చ్చి-విళుతుణ్డ**
**వాయానై మాల్విడైయేళ్ శెఱ్ఱానై వానవర్క్కుమ్**
**శేయానై నెఞ్జే ! శిఱన్దు**

తూ నీర్ ఉలకమ్ = పరిశుద్ధం అయిన నీటిని కల సముద్రంచేత పరివేష్ఠితం అయిన భూమి మొదలైన లోకాలను, ముళుదుమ్ = మొత్తం, ఉణ్డు = ఆరగించిన వాడు, (కడుపులో పెట్టుకొని రక్షించినవాడై) మొయ్ కుళలాళ్ ఆయ్చ్చి = దట్టమైన (నిబిడం అయిన) కేశపాశాన్ని కల యశోదయొక్క, విళుదు = వెన్నను, ఉణ్డ వాయానై= ఆరగించిన నోటిని కలవాడు, మాల్ విడై ఏళ్ శెఱ్ఱానై = బలిసి పొగరు పట్టిన ఏడు ఎద్దులను చంపినవాడు, వానవర్క్కుమ్ శేయానై = బ్రహ్మ మొదలైన దేవతలకు కూడా అందనివాడై ఉండే స్వామిని, నెఞ్జే =ఓ మనసా !, శిఱన్దు = అందంగా, (గొప్పగా), తొళుదాల్ = నమస్కరిస్తే, పళుదు ఉణ్డే = కొఱత ఉన్నదా ?

అతనికి -మనకు మధ్య ఉండే సంబంధాన్ని తెలిసికొని, మన శేషత్వస్వరూపానికి తగిన రీతిలో నమస్కరిస్తే నీకు ఏ ఆటంకం వస్తుంది ? మన ఆపత్కాలంలో మనలను తన కడుపులో పెట్టుకొని కాపాడే రీతిని, భక్తులకు సులభుడై ఉండే రీతిని, భక్తులను చేరడానికి అడ్డుగా ఉండే వాటిని పోగొట్టే స్వభావాన్ని కలవాడై ఉండడాన్ని, సులభులైన

వారిలో అత్యంతసులభుడై ఉండే తీరును అనుసంధిస్తే “అంతరాయాలు వస్తాయో ! ఏమో !” అని కలత పడడానికి అవకాశం లేనే లేదు- అని అంటూ తమ మనస్సును ఆఴ్వార్లు ఆశ్వాసించారు.

అవ :- ఈ రీతిలో గొప్పగా ఆశ్రయించిన తమ మనస్సును, నిత్యసూరులకంటే, అభిమానదివ్యదేశాలకంటే భగవానుడు అభిమానించిన రీతిని ఇందులో తెలుపుతున్నారు.

**26.** **శిఱన్ద వెన్ శిన్దైయుమ్ శెజ్గణరవుమ్**
**నిఱైన్దశీర్ నీళ్‌కచ్చియుళ్ళుమ్- ఉఱైన్దతువుమ్**
**వేజ్గడముమ్ వెంఃకావుమ్ వేళుక్కై ప్పాడియుమే**
**తామ్ కడవార్ తణ్డుఴాయార్**

తణ్ తుఴాయార్‌తామ్ = చల్లని తులసీమాలను అలంకరించుకొన్న స్వామి, కడవార్ = ఏనాడూ విడచి ఉండనివాడై, ఉఱైన్దదువుమ్ = నిత్యవాసం చేసే చోట్లు (ఏవి? అంటే,) శిఱన్ద ఎన్ శిన్దైయుమ్ = అన్నిటికంటే గొప్పదైన నా మనస్సు, శెమ్ కణ్ అరవుమ్ = ఎఱ్ఱని నేత్రాలను కల ఆదిశేషుడు, నిఱైన్ద శీర్ = నిండైన సంపదను కల, నీళ్ = గొప్ప, కచ్చియుళ్ళుమ్ = కాంచీనగరంలోను, వేజ్గడముమ్ = తిరుమలలోను, వెంఃకా వుమ్ = తిరువెంఃకాలోను, వేళుక్కైప్పాడియుమే = తిరువేళుక్కై అనే దివ్యక్షేత్రంలోను.

తిరువేంకటాచలం, తిరువెంఃకా, తిరువేళుక్కై- అనే దివ్యదేశాలను, “వీటికి నిర్వాహకుణ్ణి అయిన నేను వీటిని విడిచిపెట్టలేనే !” అని వాటిని తనకు సొత్తుగాను, తాను వాటికి స్వామిగా ఉండే సంబంధాన్ని చూచి వాటిని విడచిపెట్టకుండా ఉంటాడు. అందువల్ల వేంకటాద్రి, వెంఃకా, వేళుక్కైప్పాడివంటి ఒక్కొక్క తిరుపతులు ఉన్నదేశాల కంటే, పలు తిరుపతులు నిండుగా ఒకచోటే ఉండే కాంచీపురం, నిత్యసూరులలో గొప్పవాడైన ఆదిశేషుడు, సాధనస్థలాలైన వీటితో సాధింపబడే (పొందబడే) సాధ్యస్థలం అయిన తమ మనస్సు- మొదలైనవానిలో చాలాగొప్ప ఆదరాన్ని కల్గి ఉంటాడు భగవానుడు, దీనికి కారణం - ఆశ్రితరక్షణంకోసం తులసీమాలను ధరించి ఉండడమే- అని ఇందులో తెలిపారు- అని చెప్పవచ్చు.

అయితే, ఇంకో రీతిలో కూడా అన్వయించి, పాశురానికి అర్థాన్ని చెప్పవచ్చు. “నిఱైన్ద శీర్ నీళ్ కచ్చియుళ్ళుమ్ వేజ్గడముమ్, వెంఃకావుమ్, వేళుక్కైప్పాడియుమే ఉఱైన్దదువుమ్ తణ్ తుఴాయార్ తామ్ శిఱన్ద ఎన్ శిన్దైయుమ్ శెజ్గణరవుమ్ తామ్ కడవార్”- కాంచీనగరంలోను, వేంకటాద్రిలోను, తిరువెంఃకాలోను, తిరువేళుక్కైలోను తప్పదు కనుక నివసించి ఉన్నాడు- అంతే. ఆశ్రితరక్షణకోసం విలక్షణమైన మాలను ధరించినవాడు ఆదరించిన శయ్య అయిన ఆదిశేషునివలె నా గొప్ప మనస్సును అతిక్రమించలేకుండా ఉన్నాడని భావం. ఈ నిర్వాహంలో ‘నీళ్ కచ్చి’ అనేది కాంచీనగరంలో ఉన్నది, తిరువెంఃకాను, తిరువేళుక్కైను- మించిన ఒక దివ్యదేశాన్ని తెలుతుంది. “తామ్ కడవార్” అనే దానికి తమది అని అభిమానిస్తారు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ రీతిలోని మూడు విధాలైన నిర్వాహాలలోను- తిరుపతులకంటే, నిత్యసూరులకంటే తమ మనస్సునే చాలా ఆదరించాడు స్వామి- అని అన్నట్లయింది.



అవ :- భగవానుని స్వభావం ఇటువంటిది అయినపుడు అతనిని ఆశ్రయించిన వారిలో ఎవరైనా ఒకరు తాము చేసిన పాపాల ఫలం అయిన దుఃఖాన్ని అనుభవించారు -అని విని తెలిసికొన్నారన్నది లేదు- అనే విషయంలో ఆశ్చర్యం ఏమాత్రం లేదని అంటున్నారు.

**27.** **ఆరే తుయరుఴన్దార్ తున్బుఱ్ఱారాణ్డైయార్**
**కారే మలిన్ద కరుజ్గడలై-నేరే**
**కడైన్దానై క్కారణనై నీరణైమేల్ పళ్ళి**
**అడైన్దానై నాళు మడైన్దు**

కార్ మలిన్ద కరు కడలై = (నీటిని గ్రహించడంకోసం చేరిన) మేఘాలతో నిండిన నల్లని సముద్రాన్ని, నేరే కడైన్దానై = తానే ముందు నిలిచి, చిలికినవాడు, కారణనై = సర్వజగత్కారణుడు, నీర్ అణైమేల్ పళ్ళి అడైన్దానై = క్షీరాబ్ధిలో (ఆదిశేషుడనే) పడుకపై పరుండి ఉండేవాడైన స్వామిని, అడైన్దు = ఆశ్రయించి, (ఉన్నవాడు) నాళుమ్ తుయర్ ఉఴన్దార్ ఆర్ = ఏనాడు అయినా దుఃఖాన్ని పొందినవారు ఎవరు? తున్బు ఉఱ్ఱార్ ఆణ్డైయార్ = ఆవిధంగా భగవానుని ఆశ్రయించి దుఃఖాలను అనుభవించివారు ఏదేశంలో ఎక్కడ ఉన్నారు?

అతనిని ఆశ్రయించి క్లేశపడినవారు ఏ దేశంలో ఉన్నారు? బ్రహ్మరుద్రాదులను ఆశ్రయించి క్లేశపడినవారు పలు దేశాలలో అనేకకాలాలలో ఉన్నారు అనేది హిరణ్య-రావణభస్మాసురాది అసుర- రాక్షసుల కథలలో వింటున్నాము. అచ్యుతుడైన ఇతనిని ఆశ్రయించి ఎవడూ బాధపడినట్లుగా ఏ దేశంలోను వినలేదే !- అని భావం.

“భగవానుని ఆ(శ్రయించినవాడు దుఃఖాన్ని అనుభవించాడు'' అని అనడం “నిప్పుతో తడుపుతున్నాడు'' అని అనడంవలె జరగని పని- అని భావం.

అవ :- భగవానుని ఆ(శ్రయించినవారు దుఃఖాన్ని పొందడం- పంచ పాండవులకు, తమ శ(తువులను తామే సంహరించేటట్లుగా స్వామి విడిచిపెట్టినపుడు కదా, - అని అంటున్నారు. అంటే, తనను ఆ(శ్రయించిన పంచపాండవుల శ(తువులను తానే స్వయంగా నాశనం చేసి వారిని కాపాడినట్లే, తనను ఆ(శ్రయించినవారి దుఃఖాలను తీర్చి, స్వామి వారిని తప్పక కాపాడుతాడని భావం. ఈ పాశురంలో పాండవులను జీవస్థానంలోను, కౌరవులను వారు చేసే పాపకర్మల స్థానంలోను (గ్రహించి ఆ*ళ్వా*ర్లు పల్కడం గమనించదగిన అంశం.

**28. అడైన్దతరవణైమేల్ ఐవర్క్కాయ్ అన్ఱు**
**మిడైన్దతు పారత వెమ్బోర్- ఉడైన్దతువుమ్**
**ఆయ్‌చ్చిపాల్ మత్తుక్కే అమ్మనే ! వాళెయి*ఱ్ఱు***
**పేయ్‌చ్చిపాలుణ్డ పిరాన్**

వాళ్ ఎయిఱు = కత్తివంటి దంతాలను కల్గిన, పేయ్‌చ్చి = పిశాచి అయిన పూతనయొక్క, పాల్ = స్తన్యాన్ని, ఉణ్డ = ఆరగించి, ఆమె (ప్రాణాలను తీసినవాడైన, పిరాన్ = ఉపకారకుడు, అడైన్దదు = శయనించినది, (ఎక్కడ ? అంటే), అరవణైమేల్= శేషశయనంపై, అన్ఱు = పూర్వ ఒకానొక సమయంలో, ఐవర్క్కు ఆయ్ = పంచపాండవులకోసం, మిడైన్దదు = తనను (శమపెట్టుకొని, బాణ(ప్రయోగాలను సహించి, నిబిడంగా నిర్వహించినది, (దేనిని? అంటే), వెమ్ పారతమ్ పోర్ = కఠినమైన భారతయుద్ధాన్ని, ఉడైన్దదువుమ్ = భయపడి, జంకినది (దేనివల్ల అంటే), ఆయ్‌చ్చి పాల్= గోపిక అయిన యశోదాదేవిపట్ల ఉండే, మత్తుక్కే = అనురాగం వల్లనే, అమ్మనే= ఏమి ఆశ్చర్యం !

వయస్సు నిండని, పాలుకారే శైశవంలోనే, కత్తులవంటి పదునైన దంతాలను కల పిశాచి పూతన విషం కలసిన స్తన్యాన్ని తల్లిస్తన్యం కాదని (గ్రహించి, విషంతోపాటు, పాలతో పాటు, ఆమె (ప్రాణాలతో పాటు- అన్నిటినీ ఆరగించి, తనను వధించాలని తలచిన ఆమెను వధించి లోకాలకు స్వామి అయిన తనను మనకు (ప్రసాదించిన ఉపకారకుడే కదా - ఈ సౌలభ్యాన్ని తెలిపే లీలను చేశాడు. వయస్సు నిండనపుడే



ఒక పిశాచిని చంపినవాడు ఒక తల్లికి భయపడి, ఏమీ చేయలేనివాడై, నిలబడి పోవడమా! కొందఱికి దూత్యసారథ్యాలను చేయడమా ! అని ఆశ్చర్యపడుతున్నారు. ఈవిధంగా, భక్తులకు తన దివ్యతిరుమేనిని దర్శింపజేసేవాడై, వారికోసం తనను (శమపెట్టుకొని, తక్కువచేసికొని అయినా వారి కార్యాన్ని సఫలం చేసేవాడై, వారుకొట్టినా, తిట్టినా ఏమీ చేయలేనివాడై, వారి శ(తువులను అవలీలగా నశింపజేసేవాడైన ఇతనిని ఆ(శ్రయించిన వారికి ఏ దుఃఖంకూడా సంభవించదు- అని అంటూ గత పాశురంలోని అర్థాన్ని ఇందులో వివరించారు.

అవ :- గడచిన పాశురంలో “ఉడైన్దదువుమ్ ఆయ్‌చ్చిపాల్ మత్తుక్కే” అని అన్నట్లు యశోదాదేవివద్ద భగవానుడు భయపడడానికిగూర్చిన వృత్తాంతం (ప్రస్తుతం అయినందువల్ల, “ఆ యశోదపట్ల భయాన్ని కల్గి ఉండే విషయంలో ఇతనికి సాటి ఎవరూ లేనట్లుగా, ఇతనిపట్ల (ప్రేమను కల్గి ఉండే విషయంలో ఈమెకు సాటి ఎవరూ లేరు'' అని అంటూ ఆమె గుణంలో అభినివిష్టులవుతున్నారు.

**29. పేయ్‌చ్చిపాలుణ్డ పెరుమానై ప్పేర్న్దెడుత్తు**
**ఆయ్‌చ్చి ములై కొడుత్తాళఞ్జాతే- వాయ్‌త్త**
**ఇరుళార్ తిరుమేని యిన్పవళ చ్చెవ్వాయ్**
**తెరుళా మొ*ழி*యానై చ్చేర్న్దు**

పేయ్‌చ్చి = పిశాచి అయిన పూతనయొక్క, పాల్ = స్తన్యం, ఉణ్డ= ఆరగించిన, పెరుమానై = సర్వేశ్వరుడై, వాయ్‌త్త ఇరుళ్ ఆర్ తిరు మేని = నిబిడం అయిన చీకటివంటి తిరుమేనిని కలవాడై, ఇన్ పవళమ్ శెమ్ వాయ్ = భోగ్యమైన పగడంవంటి పెదవిని కలవాడై, తెరుళా మొ*ழி*యానై = రూపు తెలియని, ముద్దు మాటలను పలికే చిన్నబిడ్డ అయిన శ్రీకృష్ణుని, శేర్న్దు = సమీపించి, ఆయ్‌చ్చి = యశోద, పేర్న్దు ఎడుత్తు = చేతులార కౌగలించుకొని, ఎత్తుకొని, అఞ్జాదే = కొంచెంకూడా భయపడకుండా, ములై కొడుత్తాళ్ = తన స్తన్యాన్ని తాగడంకోసం ఇచ్చింది.

ఇంతటి ఘోరదృశ్యాలను చూచిన తరువాత భయపడి, మూర్ఛపోవలసి ఉండగా, కొంచెంకూడా భయపడకుండా, పూతన ఇచ్చిన విషమి(శితక్షీరానికి విరుగుడుగా తన స్తన్యాన్ని ఇచ్చింది యశోదాదేవి. అందులోను, కుడిచేయి ఏదో, ఎడమచేయి ఏదో తెలియని గోపకులంలో పుట్టిన యశోదకదా ఈ పనిచేసింది. ఈమెను ఇటువంటి పనిని చేసేటట్లుగా చేసినది- ఈమెకు ఇతనివల్ల ఉండే వాత్సల్యమే కదా! ఇటువంటి

వాత్సల్యం కూడా ఒకటి ఉంటుందా ! అని ఆళ్వార్లు ఆశ్చర్యపడుతున్నారు.

అవ :- భగవానుడు ఆమెకు ఆవిధంగా సులభుడై ఉన్నందువల్ల ఆమె అతనిపట్ల ఆ రీతిలో ప్రేమను కల్గి ఉన్నది. కాని, మనకతడు అంత సులభుడుగా లేడే !- అనే ప్రశ్న తల ఎత్తగా, అంతకంటే సులభుడై ఉన్న సందర్భాలను కొన్నిటిని ఇందులో ఆళ్వార్లు ప్రస్తావిస్తున్నారు.

30. శేర్న్ద తిరుమాల్ కడల్ కుడన్దై వేఙ్గడమ్
నేర్న్ద వెన్ శిన్దై నిఱైవిశుమ్బు- వాయ్న్ద
మఱైపాడక మనన్దన్ వణ్డుళాయ్ క్కణ్ణి
ఇఱై పాడియాయ ఇవై

కడల్ = పాలకడలి, కుడన్దై = తిరుక్కుడన్దై అనే దివ్యదేశం, వేఙ్గడమ్ = శ్రీవేంకటాద్రి, నేర్న్ద ఎన్ శిన్దై = (వీటి అన్నిటికంటే అతనికి ఆదరణీయంగా) లభించిన నా మనస్సు, నిఱై విశుమ్బుమ్ = అన్నివిధాల పరిపూర్ణతను కల పరమపదం, వాయ్న్ద మఱై = (అపౌరుషేయం కనుకనే భ్రమ విప్రలంభాది దోషరాహిత్యాన్ని కల్గి ఉండడమనే) అతిశయాన్ని కల వేదం, పాడకమ్ = తిరుప్పాడకమ్ అనే దివ్యదేశం, అనన్తన్ = ఆదిశేషుడు, ఆయ ఇవై = అనే ఇవి అన్నీ, వణ్ తుళాయ్ కణ్ణి = అందమైన తులసీ మాలను అలంకరించుకొనే, తిరు మాల్ శేర్న్ద = శ్రీమన్నారాయణుడు ఆదరంతో, అభిమానంతో పొందికగా వేంచేసి ఉండే, ఇఱై పాడి = రాజధానులు.

అందమైన తులసీమాలచే అలంకరింపబడ్డవాడై, దానివల్లనే తాను సర్వస్వామి అనే విషయం ప్రకటింపబడ్డవాడైన శ్రియఃపతి ఎంతో ఆదరంతో చేరి నివసించే రాజధానులు ఇవి. ఈ విధంగా భగవానుడు సులభుడై, నివసించే చోట్లను తెలిపినట్లయింది.

అవ :- "ఈ ప్రదేశాలకు వచ్చి ఉండేవాడు భక్తుల విరోధులను పోగొట్టేవాడై, దురహంకారాన్ని కల్గినవారితో సైతం ఏ తేడా లేకుండా ఒకే నీరుగా (నీరు నీటితో కలసినట్లు) కలిసే సౌశీల్యగుణాన్ని కల్గినవాడు కదా ! - అని ఇందులో అంటున్నారు.

31. ఇవైయవన్ కోయిల్ ఇరణియనతాకమ్
అవై శెయ్‌తరియురువ మానాన్ - శెవి తెరియా
నాకత్తాన్ నాల్‌వేతత్తుళ్ళాన్ నఱవేఱ్ఱాన్
పాకత్తాన్ పాఱ్కడలుళాన్

ఇరణియనదు = హిరణ్యకశిపుని, ఆకమ్ = వక్షఃస్థలాన్ని, అవై శెయ్‌దు = భిన్నం చేయడం కోసం, అరి ఉరువమ్ ఆనాన్ = నృసింహరూపిగా అవతరించినవాడు, శెవి తెరియా నాకత్తాన్ = "చక్షుఃశ్రవః" అనే నామాన్ని కల్గిఉండడంవల్ల చక్షురింద్రియంతో శ్రోత్రేంద్రియకార్యాన్ని కూడా నిర్వహించగల్గినవాడు కనుక, చెవిద్వారా ఏర్పడే జ్ఞానం లేనివాడైన ఆదిశేషుని తిరుమేనిలో పరుండి ఉన్నవాడు, నఱవు ఏఱ్ఱాన్ పాకత్తాన్ = తేనెవంటి గంగను ధరించిన రుద్రుని తన తిరుమేనిలోని ఒక భాగంలో కల్గినవాడు, పాఱ్కడలుళాన్ = క్షీరాబ్ధిలో పరుండి ఉన్నవాడైన, అవన్ = ఆ స్వామియొక్క, కోయిల్ ఇవై = కోవెలలు ముందు పాశురంలో చెప్పబడ్డ దివ్యస్థలాలు.

క్షుద్రప్రయోజనాలను పొందడంకోసం అయినా దేవతలు తన వద్దకు రారా ! అని ఎదురు తెన్నులు చూస్తూ, వారి పిలుపులను వినే చోటు అయిన క్షీరాబ్ధిలో శయనించి ఉండేవాడు. ఇన్నిచోట్లలో ఇంతటి శీలగుణాన్ని కలవాడై అతడు మనకోసం ఆదరంతో ఉన్నపుడు ఓ మనసా ! నీవు అతనిని విడచి పోవచ్చునా ?- అని భావం.

అవ :- పూర్వం ప్రస్తావించిన దేశాలు మాత్రమేనా ? గొప్ప సౌశీల్యగుణాన్ని కలవాడై, అతడు వేంచేసి ఉండే దేశాలకు ఒక అంతు లేదు కదా ! అని ఇందులో అంటున్నారు.

32. పాఱ్కడలుమ్ వేఙ్గడముమ్ పామ్బుమ్ పని విశుమ్బుమ్
నూఱ్కడలుమ్ నుణ్ణూల తామరైమేల్- పాఱ్పట్టిరున్దార్ మనముమ్ ఇడమాక క్కొణ్డాన్
కురున్దొశిత్త కోపాలకన్

కురున్దు = అసురావిష్టం అయిన బండిగురివింద చెట్టును, ఒశిత్త = విఱిచిన, కోపాలకన్ = గోవుల మందను కాచే (విరోధినిరాసాన్ని చేయడం స్వభావంగా కల) శ్రీకృష్ణుడు, పాల్ కడలుమ్ = భక్తుల ప్రార్థనలను వినే చోటు అయిన క్షీరాబ్ధిని, వేఙ్గడముమ్ = "కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్" అని కీర్తింపబడ్డ వేంకటాచలం, పామ్బుమ్ = "శెన్ఱాల్ కుడైయామ్" అని సర్వవిధకైంకర్యాలను చేసే ఆదిశేషుడు, పని విశుమ్బుమ్ = (సంసారంలో ఉండే తాపత్రయాలు ఏవీ లేనందువల్ల) చల్లని మంచువంటి శీతలస్వభావాన్ని కల భోగ్యమైన పరమపదం, నూల్ కడలుమ్ =

